హక్కులు గ్రంథకర్తవి

ప్రథమ ముద్రణము
1993 మార్చి

మూల్యము : ఇరువది రూపాయలు

ముఖచిత్రణ : వింజరపు వీరసాయి

ముద్రణ : శ్రీపత్రిప్రెస్
కాకినాడ-533001

ఈ గ్రంథముద్రణము
తెలుగు విశ్వవిద్యాలయార్థికసాహాయ్యము

ప్రతులకు :

**డాక్టరు. యస్. టి. జ్ఞానానందకవి**
కాకినాడ-533003

"శ్రీ కాకివంశ జలనిధి
రాకా నీహారకిరణ రమ్యునకు యశ
శ్శ్రీకి, మనస్వికి నిచ్చితి
నాకృతి 'నాహ్వానము' భువనము గొనియాడన్."

కృతిపతి



శ్రీ కె. మాధవరావుగారు ఐ. ఎ. ఎస్.

# అంకితము

కువలయమ్మున గీర్తిగొన్న యంబేద్కరు
నా జ్ఞాపథమ్ములో నడుగువైచి
మంచిచెడ్డల సమీక్షించి సత్యముదెల్పు
హేతు వాదానకు చేతులెత్తి
జబ్బుసాచెడు నైచ్యసంస్కృతి న్నిరసించి
మానవత్వమునకు మనస్సునిచ్చి
బ్రతుకులో కడగండ్లుపడిన దీనులపట్ల
కరుణారహింప నాదరము నెఱపి

క్రమ నిభృతయశుడు కాకి మాధవరావు
మానవతకు మఱొకమారు పేర
నలరు వాని కెలమి 'నాహ్వాన' కావ్యమ్ము
మెచ్చి యంకితముగ నిచ్చినాడ.

నెఱిస్వాంతమ్ముల శోభనాద్రి ఘనమాణిక్యమ్మ లేపూజసే
సిరో విద్యాతపనీయరాశి జనియించెన్ పుత్త్రరత్నమ్ముగా
నరయన్ మాధవరావుపేరున యశంబార్జింప నట్లే వసుం
ధర శ్రీమాధవరావు కీర్తి గొనుచున్నారిద్ది యాథార్థ్యమా.

## అంకితము

వాక్పరిపాలనాచతురభావుడు సత్యమతిక్రమించు నా
దికృతినైన నడ్డుకొను ధీరమనస్కుడు మానవీయతా
దృక్పథశీలి సద్గుణవరిష్ఠుడు మాధవరావుగారు స
మ్యక్పరిశీలనాత్మకుడు నాతని కబ్బుత దివ్యభోగముల్.

చెలువొప్పారెడు ధీలసద్వినయరాశీభూతులౌ శోభనా
ద్రులు శ్రీకాకికులైక భూషణులు బంధువ్రాతముల్ గ్రామపె
ద్దల మర్యాదల నందుకొంచు పెదమద్దాలిన్ వసించున్ కృషీ
వలుగా పంచమపెద్దగా బ్రతుకుగా పాలేరుగా ధర్మిగా.

నమ్మినక్షేత్రరాజములు నల్వగపండగ దీక్షబూని సే
ద్యమ్మొనరించి రైతుల సమాదృతిపొందిన శోభనాద్రి చి
త్తమ్ము విలక్షణంబయిన ధర్మగుణమ్ములు కాకివంశపున్
సొమ్ములు నిమ్నజాతులకు స్ఫూర్తినొసంగెడి మేలిదివ్వటీల్.

పొలము పనులు సేయువలెకుమారు లటంచు
ఘనుడు శోభనాద్రిగారి తలపు
తనయులెల్ల చదువుకొనవలె మాణిక్య
మాంబగారి గాఢమైన వలపు.

భావి యుగాలలో బుడుతప్రాయమునం దలవర్చుకొన్న స
ద్భావములే సమాజమున సంస్కృతికద్దముపట్టు నట్టి స
ద్భావనకాలవాలమగు బాల్యమునందున మాతృమూర్తిశి
క్షావిధిలోని బోధనలె కారణముల్ వివరింపనేటికిన్.

## అంకితము

విరి జనించుతోనె పరిమళించినభాతి
చిఱు వయస్సునందె పరిఢవించె
సాధుమూర్తి కాకిమాధవరావు క
ష్టాల ప్రతిఘటించి చదువులోన.

ఎలిమెంటరీ పాఠముల వేడ్కమై పెద
మద్దాలి పుట్టు గ్రామమున చదివి
ఎలిమి హైస్కూలు విద్యలనల యెలమఱ్ఱు
పామఱ్ఱులో కష్టపడి పఠించి
ఇంటర్ బియేల్ తీవ్రకృషిసల్పి యున్నత
శ్రేణిలో విజయలక్ష్మినివరించి
బి.య్యే.ఆనర్సాంధ్ర విశ్వవిద్యాలయ
మున జేసి, యున్నత గుణములందె

ఆటపాటలందు నభిమానమున్నను
నక్షరాల యందెయక్షీయుగము
శ్రద్ధమెయిని నిలిపి సాగిన మాధవ
రాయునకు చిరాయువగుత మెపుడు.

ప్రయతుండౌ ఘనకాకివంశజు డహోరాత్రాలు గ్రంథంపుట
ధ్యయనంబున్ బొనరించుచే బ్రతుకు లక్ష్యంబంచు భావించి య
శ్లై యహోరాత్రములెల్ల తా చదివె నట్లే ఐ.యె.ఎస్సై నిరా
శ్రయులౌ పేదల కండగా నిలిచి పేర్గాంచెన్ ప్రజాబంధు నై.

## అంకితము

యువదశలో వరించిన మహోన్నతమౌ పదవుల్ వహించి పే
రు వడసె మానవత్వము నిరూపణ సేసి దరిద్రజాతినిన్
మిత్రుల సమాదరించిన మనీషి! దయార్ద్రహృదుండు కాకివం
శవిభుడు పాలకోత్తముల శంసలు నందుట జాతి భాగ్యముల్.

ఎన్నో వేలయుగాలనుండి తలపన్ హీనంపుటీర్ష్యమ్ముమై
పన్నాగమ్ములుపన్ని పంచములకున్ భ్రష్టత్వమంటించి వి
ద్యన్నేర్పింపని భ్రష్టసంఘముల యన్యాయమ్ము ఖండింపగా
నెన్నన్ మాధవరావు కష్టపడి ఐ.యే.యస్సు! నుత్తీర్ణుడై.

స్వర్ణసస్యాల నిడు వ్యవసాయకూలి
సకలజనశుభాలను గోరు సాధువాళి
అమలచరితుండు శ్రీశోభనాద్రిపొందె
గౌరవమ్ము మాధవరావుగారివలన.

'మసూరి' 'లోనైయే
యస్సు' ట్రైనింగ్ సుశిక్షణాలయమందున్
లెస్సగ నేరిచి ధిషణో
షస్సునకున్ పదును వెట్టె సాహసమొప్పన్

మజిల ట్రైనింగు వైశాఖపురమునందు
నొక్కయేడాది సదివి మహోత్సుకతను
చిన్నతనమున నలవర్చుకొన్న యట్టి
ప్రథితగుణములు మాధవరావుకబ్బె.

## అంకితము

అరయన్ మాధవరావుగారి హృదయంబందున్ వసించున్ నిరం
తరమున్ దీనులపట్లజాలి గుణ మౌదార్యమ్ము లాతీరులో
'నరిసీపట్నము' 'పార్వతీపురము' లోనన్ 'సబ్ కలెక్టర్'గ బం
జరుభూముల్ నిఱు పేదవారి కిడె దేశక్షేమ దృష్టిన్వెసన్.

తండ్రి వ్యవసాయవృత్తిలో దనరి పేరు
గొనియె, మాధవరావును గొనబుమీఱ
కీర్తి గడియించె తనఋజువర్తనమున
ఇరువు రిరువురు పేర్గడియించినారు.

బలహీనులైన పేదల జీవితాలతో
నాటాడు భూస్వాము లాటకట్టి
చట్టమ్ము నెదిరించి సంచరించెడు గుండ
గొయ్యల గుండెలో కునుకుదీసి
అక్రమాలొనరించి యలజడుల్ రేపించు
మోరకులకు గట్టిబుద్ధి సెప్పి
అనపరాధులు చెప్పుకొనిన కష్టాలకు
స్పందించి వెంటనే సాయమొసగి

నెమ్మనమున కరుణనిర్ఝరమ్ములుపాఱు
సత్యమునకు కలముజాలువాఱు
మనసుగల్గినట్టి మాధవరాయన
కాత్మబంధుజనములనదలెల్ల.

## అంకితము

తల్లి ప్రబోధముల్ తలనుదాల్చి యామె వచించు సత్కథా
వల్లరి కంఠహారముగ వైచి యుగాలచరిత్రలోన శో
షిల్లిన పంచమీయులను జీకటులందున మ్రగ్గుజాతి శో
భిల్ల ప్రతిజ్ఞబూనిన విశిష్టుఁడు మాధవరావు చెప్పగన్.

అంబేద్కరుడన నాణే
క్యాంబకు గౌరవముకలుగు నాతనివలె లో
కంబున తన సుతు డెంతయు
పంబిన కీర్తిగడింప వలెనని తలచెన్.

తల్లి పట్టుదలను చెల్లించి మాధవ
రావు చదివి ప్రజల ప్రణతులంది
చెప్ప లేనియట్టి గొప్పయుద్యోగాల
నిర్వహించె నిపుడు నిర్వహించు.

అధికారిగ ఘనకార్యాల్
విధియని సాధించికొనియె పేరున్ గానీ
ప్రథగల్గె వరంగలులో
పృథులంబగు క్రియల మానవీయత వలనన్.

సలిపెన్ ధీరత భూబకాసురులు నాశ్చర్యమ్ము పొందన్ వరం
గలుజిల్లా యధికారిగా కుములుచున్ గంజింత లేనట్టి వా
రలకున్ బంజరుభూములన్ ప్రభుతకార్యంబంచు పట్టాల్ దరి
ద్రులకున్ మాధవరావుగా రొసగి రక్షల్ పేదలేనాటికిన్.

## అంకితము

దోచుకొనెడివారు దోచుకోబడినట్టి
జనగణాలుమసలు క్ష్మాతలాన
నేడి సామరస్యమెన్నాళ్ళు నీరీతి
జరుగవలయు సమయపురుషు డెఱుగు.

సంఘాలనింపుగా గలుపు కోరికను పేదలకెల్ల సంపదే
నింపుతనమ్మటంచు నవినీతి సహించని మానవుండు శ్రీ
శౌండుడు కార్యసాధకుడు సజ్జనమిత్రుడు శోభనాద్రి పు
త్రుండధికారులందెనయ తీరవు గౌరవకీర్తులం గొనెన్.

భూములు లేని పేదలకు భూములుకల్గిన గొప్పవారికిన్
భూములకోసమై కలహముల్ సెలరేగ నదొక్క చిన్న సం
గ్రామముగాగ మాటలు గాంచిన మాధవరావుగార లా
భూములనెల్ల పేదలకుపూర్తిగ పంచె కలెక్టరౌటచే.

కేసు పెట్టిరి భూస్వాము లీసుతోడ
నిచ్చె పేదలకే భూమినీ కలెక్ట
రనుచు మాధవరావుపై నసలు నిజము
తెలిసె చివరకు పేదలే గెలిచినారు.

కలిమిగలిగిన వసుధను గెలువవచ్చు
కలిమిగలిగిన భోగాలు కలుగవచ్చు
కలిమితో ధాత్రి నేదైన సలుపవచ్చు
కలిమి యెదలనుమాత్రమ్ము గెలువలేము

**అంకితము**

ఇతడు బీభత్సకారుల హితుడితండు
పేదవారల గుండెలో విప్లవాగ్ని
రగులచేసిన మాధవరాయు నితని
శీఘ్రగతిలోన ట్రాన్స్‌ఫర్ చేయవలయు.

ఘూబకాసురులెల్ల ప్రభుత్వమునకు
దెబ్బతిన్న భుజంగాల తీరువోలె
వెఱ్ఱికోపాన పిటిషన్లుపెట్టి నార
లేవిశేషాలు వార్తలకెక్కె నాడు.

ఏమీలేనటువంటి పేదలకు తానే యండగానిల్చి భూ
స్వామ్యుల్ చేసిన కుట్రకుహాలకు పెస్ పగ్గాలువేయించి పూ
జామర్యాదలనందె నెల్లరకు నాశాదీపమై నిల్చుచున్
మా, మాణిక్యమగారి పుత్రుడు యశోమాన్యుండు చర్చింపగన్.

నాటిముఖ్యమంత్రికి మరి నాటిరాష్ట్ర
పతికి నిర్వాహ్యులైన భూస్వాములెల్ల
తమదు గోడును వినతిపత్రములద్వార
విన్నవించిరి తెలుగుల పెద్దమంత్రి.

ప్రభుతచట్టము మాధవరావుగారు
చేసినారలంతేకాని చేయలేదు
తనదు సొంతముగానని యనుచు నిడిరి
ప్రముఖమాశంస మాధవరాయునకును.

## అంకితము

గూఢగుయ్యాన కలిగిన కులజులెల్ల
రాష్ట్రపతికి నివేదింప రాష్ట్రపతియు
నేరపరిశోధకపు గూఢచారిశాఖ
కప్పగింపగజేసె దర్యాప్తుకొఱకు.

వార్త సేకరించు పత్రికాప్రతినిధుల్
నిజము తెలిసి వ్రాసి రీయుదంత
మెల్ల నోరుగల్లుజిల్లా కలెక్టరు
క్రమధర్మమార్గగామి యనుచు.

ఎన్ని యొత్తిడుల్ వచ్చిన నెన్నిసార్లు
ధనిక లాగడాల్ సాగిన ధైర్యచిత్త
వృత్తితో పేదలకు సాయమే యొనర్చె
నాత్మవిశ్వాసమున శోభనాద్రి సుతుడు.

ఎలమిన్ కోడెవయస్సులో సదివి ఐయే.యెస్సుపాసై మహాం
ధ్రులు కొండాడగ నున్నతంబయిన యుద్యోగాల నెన్నింటినో
సలిపెన్ తా నొనరించువృత్తికి జయస్తంభమ్ము నెత్తించి పే
దలకున్ పెన్నిధి కాకివంశజుడు ప్రస్థానించు ధర్మాధ్వమున్.

మాధవరావుగారికి సమత్వముతప్ప మరే పురాణపున్
గాథలటన్న కిట్టవు జగద్ధితమై తలపోయు సర్వదా
బాధితులైన పేదజనపక్షముహస్తముజాచు తథ్య మీ
మాధవరావు మాధవుడు మాకనియందురు పేదలెప్పుడున్.

**అంకితము**

ఎత్తుల్ వేయని తత్త్వవేత్త మరియే యే రాజకీయాలతో
పొత్తుల్లేని మహామనస్వి కరుణాంభోరాశియౌ బుద్ధునిన్
చిత్తంబందున నిల్పుకొన్న గుణవచ్ఛ్రీమంతు డాహ్వానపున్
పొత్తంబన్న రమన్ గ్రహించిన కళాపూజ్యుండు నాకల్లురా.

విలసిత విజ్ఞాన వేత్త యంబేద్కరుడు
పలుకులయందు విశ్వాసముంచి
సకలలోకాల ప్రజావళి యొకటన్న
మానవీయతకు నమస్సు లొసగి
అరుసమొప్పగ కులాంతర వివాహాలను
సాదరబుద్ధిమై స్వాగతించి
భ్రష్టమార్గమువట్టు రాజకీయమ్ముల
ప్రాంగణమ్ములకు దూరమున నిలిచి

జనులజీవితాల మనుగడల్ తనజీవి
తంపు ధ్యేయమంచు తలచినట్టి
ఘనతగాంచినట్టి కాకిమాధవరావు
భువనమున సుఖాలు పొందుగాక.

ప్రథిత రాజ్యాంగశాసన స్రష్టయైన
బాబ యంబేద్కరుని పేర ప్రజలుమెచ్చ
నొకసినీమ, విద్యాసంస్థ లొనరనిలుపు
వారలందు మాధవరావుగా రొకండు.

## అంకితము

మానవావళిలో నమానుషమైన వ్య
త్యాసంపు టసమానతలకు కుంది
బ్రతికిచెడిన బహిష్కృతజాతి వేదనా
భారమ్ముగాంచి కన్నీరునించి
పొట్టకూటికే యజ్ఞములుసేయ శాసించు
శాస్త్రమ్ములను నోరుచప్పరించి
ఘనసంస్కృతులకు విఘాతమ్ము గల్గించు
మూఢ కర్మల నెల్ల ముదలకించి

వర్ణభూతమ్ముపై మహోద్ధ్వజము నెత్తి
దీనులాక్రందనల కెంతో దిగులుచెంది
జీవనము సేయు మాధవరావుగారు
క్ష్మాతలానకు దిగినట్టి సాధుమూర్తి.

మతములేనియట్టి మాధవరాయున
కితము సమ్మతంపు మతము నుడువ
మహితలక్షణంపు మానవతావాద
భావనమ్ము దివ్యజీవనమ్ము.

నేతలవంశజాత రమణీయగుణాలకు పట్టుగొమ్మ సం
జాత విశిష్టమానస నిజాయితికిన్ మెడవంచునట్టి సా
ధ్వీతిలకమ్ము లక్ష్మి జగతీతలభాగ్యము గోరుకొన్న సం
పూతచరిత్ర వంశజనభూమిత మాధవరాయ పత్నియా.

## అంకితము

స్వీయజీవన మాశించి చిత్తమదర
కృషినొనర్చి స్థాపించె పరిశ్రమమును
నలువ మలర మాధవరాయ నందనుండు
యువహితుండు సుధీర్ నామ కోత్తముండు.

వైద్యశాస్త్రమునందు పట్టాగ్రహించె స
న్మతి తొలికొమిరె భామతి సుజాత
ఆర్డివో పదవి శ్రద్ధాసక్తి సాగించు
మలి తనూజాత ధీమతి సునీత
మాన్యుండు ప్రథమజామాత వివేకని
ధియుగు కలెక్టర్ ప్రదీపచంద్ర
అరయ రెండవయల్లురా సబ్ కలెక్టరు
పేర్గన్నయట్టి ప్రవీణ్ కుమార

దేశహితముగోరి దీనుల దరిజేరి
మాననీయమైన మానవతకు
విలువగట్టి యిలను వెలుగు మాధవరాయు
నకు నొసంగినాడ నాదుకృతిని.

విద్యావారాశికి నిర
వద్య సమున్మేష భావబంధురకలనా
ప్రోద్యన్మతికి దయాగుణ
హృద్యస్వాంతునకు సుజనహితమిత్రునకున్.

## అంకితము

దీక్షాదక్షునకు నిశిత
శిక్షణలక్షణునకు జనసేవామతికిన్
దాక్షిణ్యమూర్తికి లస
ద్వీక్షణునకు శోభనాద్రి ప్రియపుత్రునకున్.

నేతల లక్ష్మీపతికిన్
త్మతలి భాగ్యములగోరు మహనీయునకున్
ప్రీతిని బాబాసాహెబు
పూతచరిత్రమ్మునిల్పు బుధసారథికిన్.

మూఢాచారమ్ముల నతి
గాఢమ్ముగ ప్రతిఘటించు ఘనమానవతా
రూఢ మనస్వికి హితవా
క్ప్రౌఢికి ధీరునకు కాకి వంశేందునకున్.

మాధవరాయునకు కళా
రాధనునకు ధర్మపథవిరాజితునకు శు
ద్ధోధన నందనుసూక్తి శి
లోధారికి దుష్టజనవిరోధాత్మునకున్.



# స్వాగతము

ఇది "ఆహ్వానము" అను నామతోక ఖండకావ్యము. ఇప్పటి
కిరువదియేడు గ్రంథము లచ్చయినవి. ఇంక అచ్చునకు ఎనిమిది
గ్రంథము లున్నవి. ఇందుకొన్ని వ్యాస సంపుటీకరణము లున్నవి.
ఇవియే యచ్చుకావలసి యున్నచో పైవానికి ద్వితీయముద్రణ
మెట్లుపొసగును? కాల మన్నిలోపాలను తీర్చవలయును. రసజ్ఞ్ఞే
యుల హృదంతరాళములలో స్పందనభావము పుంజీభవింప వల
యును. ఏదెటులున్నను నా కవితా రచనావ్యాసంగములను తిల
కించి అభినందనలతో తమ ఆమోదమును నేటికి వ్యక్తీకరించు
చున్న మధురకవితామందాకినీ తరంగ డోలికానంద రసవిహారులకు
నా యభివాదములు. నేడు వెలువడుచున్న సాహిత్యమును గూర్చి
గాని పరంపరలుగా సాక్షాత్కరించుచున్న కవితాప్రక్రియల
గుఱించిగాని నేను పలుకనవసరములేదు. ఎందరెందరో విమర్శకో
త్తంసులు ప్రముఖసాహితీప్రవరులు ప్రకటించుచునే యున్నారు.
సరే; ఆలంకారికుల శాసనబద్ధమైన శాస్త్రము లుండనేయున్నవి.
అన్నింటినిమించి రసజ్ఞపాఠకోత్తములు గలరు.

జన్మతః సత్కవు లున్నారు. వారు వ్రాయుదురు. ఆ వ్రా
తలు సమాజశ్రేయస్సు గోరినవై యుండును. వారికి భజనగాండ్ర
తో పని లేదు. అడ్డదారులదొక్కి గౌరవాల నాశింపరు. నిరంకుశాః

కవయః అన్న పదానకు వారు ప్రతీకగా నిలుతురు. సాహిత్యజీవనమే వారి జీవితధ్యేయము. అదివారికి ఉచ్ఛ్వాస నిశ్వాసములు. వా రితరుల నాశ్రయింపరు. కవియన్నవానికి వలసినంత బాధ్యతయున్నది. నేర్వదగిన విద్యలెన్నోయున్నవి. సాహిత్యవిద్య అన్నివిద్యల సారమని రాజశేఖరుని కావ్యమీమాంసలోని మాటలు చిత్తగింపుడు.

"అన్వీక్షికీ త్రయీవార్తా, దండనీతిశ్చేతి విద్యాః.....
........................................................"

ఎవడు మహాకవి? ఏది మహాకావ్యము? కవి కాదలచినవానికి గొప్పబాధ్యత కలదనియు నతడు నేర్వవలసిన విద్యలెన్నియోయున్నవని భామహుని వాక్యములను గూడ నాలకింపవలయును.

"న తచ్ఛిల్పం న తచ్ఛాస్త్రం
న సావిద్యా న సాకలా
జాయతే యన్న కావ్యాంగమ్
అహోభారో మహాకవేః"

కవి తపస్వి కావలయును. రసహృదయము కలవాడును కావలయును. అనగా ఋషిభావసంపన్నుడు కావలయును. విశ్వధర్మముల సాక్షాత్కారము గలవారు ఋషులు. కవియు నంతే.

"ఋషయః సాక్షాత్కృత ధర్మాణః
యః సర్వజ్ఞః సర్వవిత్
యస్య జ్ఞానమయం తపః"

శ్రుతి ఈశ్వరునకు వర్తించునట్లుగ కవీశ్వరునకు గూడ వర్తించును. మహాకవి లోకజ్ఞుడు నయి యుండవలయును.

కవి కావ్యమునందెట్టి నిర్మలత్వము స్వచ్ఛత్వము గోరు కొనునో అతని జీవితమునందును నట్టిధర్మములను నిరూపింపవల యును. ఆంగ్ల మహాకవి 'మిల్టన్' వాక్కులు గమనార్హములు.

## A Poet must live in his Poem

కవి జీవితము కావ్యజీవిత మీరెండును సమపాళములలో నుండవలయును. సద్యః పరనిర్వృతి ఉపదేశము కావ్యప్రయోజన జనములు. పాశ్చాత్య సాహిత్య విమర్శకుల పలుకు లవశ్యములు

## A Great Poem has a message

కవి సమాజ ప్రగతికోసము చైతన్య స్ఫూర్తిమంతమయిన సందేశము ఇయ్యగలిగిననాడే యాకవితకు సార్థక్యము.

దేశము పట్టనంతే యెంతటికవియైనను తాను నివసించు సమాజపరిధిని యుల్లంఘింప నేరడనుట జగద్విదితము. ఆనాటి సామాజిక స్థితిగతులను వాతావరణముల నాకళించుకొని రచనలు సాగించును, సమీక్షించును. నేడు సాహిత్య నందనోద్యానములో భిన్న భిన్నమూర్తులైన కవితాప్రక్రియలు షికారుచేయుచున్నవి. ఏ ప్రక్రియలయిన నవి మనుచున్న యుగమునకు స్ఫూర్తికల్గించి ఉజ్జ్వల భవిష్యద్ఘంటాపథములో నడిపింపవలయును. సమాజ శ్రేయస్సునకాధారమైన యేప్రక్రియనైనను రసజ్ఞులు దానిని స్వాగతింప వలయును. ఇందులో మడతపేచీ యేమియు లేదు. అన్ని ప్రక్రియలు సమాజశ్రేయస్సునే వాంఛించినచో నీ ప్రక్రియకన్న

నీప్రక్రియేగొప్పదను దురహంకారము మాసిపోవలయును. సాహిత్యము సహితముతో గూడి యుండినదనుట లాక్షణికుల యభిప్రాయము. అందువలన

"సహితయోః శబ్దార్థయోః భావః సాహిత్యమ్
అని కాకుండ "సహితానాం సర్వవిద్యానాం భావః సాహిత్యమ్" అనుట సమంజసముగా నుండును.

ఉన్నత ప్రమాణములు కలిగి సామాజిక ఉజ్జ్వల చైతన్యమునకు కరదీపికలుగా చెలగి సర్వోన్నత సర్వోదయ సమున్మేష భావజాల మందించు ప్రతిప్రక్రియకు స్వాగతము పలుకవలసినదే కాని న్యక్కారభావము చూపరాదు. సరసబంధుర సాహిత్యము శాశ్వతముగానే నిలువగలదు. అది పద్యమైన గద్యమైన మఱియే యితర ప్రక్రియలైనను, చాలమంది సంయమన సమన్వయ స్వభావ రహితులు పద్యము చచ్చిపోయినదని యందురు. అనినవార లటు లౌదురేమోకాని పద్యముచావదు. నేటికి వేయివత్సరాలైనవి. భాష యున్నంతవరకు పద్యము నిలుచును. ఈ పలుకులలో మఱొకభావనకు చోటులేదు. విశ్వనాథ, జాషువావంటి సుప్రసిద్ధ పద్యకవులు నిలిచినారు. ఇకపోతే కిట్టనివాండ్రవాక్కు లసమర్థనీయములు. అజ్ఞానాహంకారములకు నిలయములు. మంచిచెడుల సమీక్షింపలేని విమర్శకప్రభువు లున్ననేలలో, కాలములో సవిమర్శకు స్థానములేదన వచ్చును. విమర్శకునకు వివేచించు విమర్శనా విచక్షణాచక్షువు లుండవలయును. "కార్లైల్" అభిభాషణము అవధరింపుడు.

## 'A Critic must have a Seeing eye'

తెలుగుల విమర్శకుల కీదృష్టి చాలయసర మని యనుటలో చొరవ చేయగలను. ఈనాటి విమర్శకులు తమతమ వర్గము, కులము బంధుప్రీతి మున్నగువానిపైని యాధారపడుచున్నా రనుటలో నా సమాధానము నాదగ్గఱ నున్నది. వ్రేళ్ళమీద లెక్కింపగల సద్విమర్శకులు కొందరు గలరు. సామర్థ్యముగాదు అవకాశము లభింపవలయును. అసమర్థుల నందలమెక్కించునాడు సమర్థవంతుల ప్రతిభాపాటవాలకు, రచనావిశారదులకుగల చోటేది?

ఈ దేశము తీరుతెన్నులే యిట్లున్నవి. సంస్కృతీ సాహితీ కళారంగాలగుఱించి ఊదరగొట్టి ఊకదంపు డుపన్యాసాల గావించు బుద్ధిజీవులున్నచో దేశానకు పురోగతియేది? కవులు, రచయితలు దేశప్రగతికి రచనలు సాగింపవలయునని యందురు. ప్రతిభ కాలు నిలదొక్కుటకు స్థలమెక్కడ? కాలు నిలద్రొక్కుకొనవలయు నన్న కులమో, వర్గమో, అర్థమో కావలయును. నేడు ధనతృష్ణ కామతృష్ణ, పదవీతృష్ణ, ఈ మూడును విశృంఖలములుగా సమర దుందుభి మ్రోయించుచున్నవి. ఇట్టి విషమ, వికార పరిస్థితిలో కవులు, రచయితలు, తమ అమృత కవితారచనా సుప్రభాతగీతికా సందేశాలు విశ్వంభర ధ్వనించునట్లుగా ధ్వనింపజేయవలె నన్న సాహిత్యమే సర్వోదయము కావలెనన్న, కవితాపీయూష నిర్ఝరీ ధారాప్రవాహములు మానవభువన కేదారాలలో ప్రవహింప జేయ వలయును. ఆనాడు దేశానకు మహోజ్జ్వలోన్నతభావి, మానవానీక హృదంతరాళ బృందావనీ వీథిలో తావి. మహాపురుషులు తమ త్యాగమయ జీవితాలద్వారా లోకమునకు వెలుగు

ప్రసరించుటకు నేర్పాటైపోయిన నక్షత్రములవంటివా రని 'నెపోలియన్' వాకొనిన ఋజువచనములు సత్యబంధురములు కవులు నంతే;

సాహిత్యము గుఱించి యెంతైన చర్చ సలుపవచ్చును. దేశభవిష్యత్తుగూర్చియే నాఆరాటము. దరిద్రమానవావళికి నాలంబనము కలుగవలయుననుటే నా యాశాగానము. నిస్వార్థచిత్త కవితా యానము. మొత్తముమీద యీసమస్త మహీవలయము నందలి మానవులు కాంక్షింపవలసిన కమనీయభావనము భగవంతుని కోరుకొనుచున్న "సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సిస్" అమృత వాక్కులలో తొణకిసలాడు భక్తిమాధుర్యభావమును తిలకింపుడు. విశ్వమానవుల హృదంతరములలో నిరంతరము నినదింపవలసిన దీ మానవగీతము.

Lord make me an Instrument of your Peace,

Where there is hatred  
Let me Sow love;  
Where there is Injury,  
Pardon;  
Where there is Doubt,  
Faith;  
Where there is Despair;  
Hope;  
Where there is Darkness,  
Light;  
And  
Where there is Sadness,  
Joy;

## స్వాగతము

సర్వసాహిత్య ప్రక్రియలపట్ల రసానందహృదయులు, సమాజ నిరంతర పురోగమన రిరంసామతులైన రసజ్ఞలోకము నాయీ ఆహ్వానకావ్యాంతర్గత నిబిరీయసభావాలకు తలలూపినచో నంత కంటె నాకేమి కావలయును. మునుపటివలె నారచనలు చదివి అభినందించి ప్రోత్సాహమిచ్చిన కళాభిజ్ఞులను నా, ,యీ ఆహ్వాన కావ్యోద్యాన వనవాటికలో విహరింప నాహ్వానము పలుకు చున్నాను.

ఈ కావ్యమును మానవతావాదులు ప్రభుత్వోన్నతోద్యోగులు మాన్యులు శ్రీ కె. మాధవరావు ఐ. యే. ఎస్. గారికి కృతి నిచ్చుచున్నాను.

రససిద్ధాః కవీశ్వరాః

కాకినాడ

24-3-1993

జ్ఞానానందకవి



# సూ చి క

# ఆహ్వానము

ఇదె! యాహ్వానము మీకు నెల్లరకు నేడేరండు జాతీయసం
పదకున్ మూలము సోదరత్వముల ప్రేమస్నేహ రాగాలకా
స్పదమౌ యజ్ఞము నిర్వహింపబడె నిప్పాటన్ ధరాచక్రమం
దిది యీభారతదేశ సంస్కృతికి కాదే! హర్షణీయాంశముల్.

ఎన్నో భిన్నమతాలు వర్గములు నింకెన్నో కులాలెన్నొ యిం
కెన్నో ఘర్షణలెన్నొ భేదములతో నీ భారతక్షోణి నా
డున్నన్ నేడును కల్గినన్ విడువలే దూహింప నైక్యమ్మదే
శౌన్నత్యమ్మున కొడ్డినా రుసురులాహ్లాదాన భక్తాగ్రణుల్.

ఈదేశీయ సమగ్రతప్రగతి కీవేకారణంబౌదు వీ
వే దేశమ్మవుగాని వేఱొకటిగాదే! శైలముల్ నిర్ఝరుల్
ఈదేశానకు లక్ష్మి నీదగు తలంపే దేశకల్యాణరే
ఖాదీక్షాద్రఢిమంపు దక్షతకు ముఖ్యంబిద్ది యోజింపుమీ!

వివరింపన్ ఋతమౌను హైందవమహావేదాంతపీయూషబిం
దువు లీధాత్రిని జాలువారినవి సంతోషమ్ము శాంతిక్షమా
సవనక్ష్మాతలి నేకతాసమిధలన్ జాగ్రన్మహాస్వాంతులై
రవులన్జేయగ రండు నాడె యలరున్ రాణింపు దేశానకున్.

## ఆహ్వానము

ఒకదేశమ్ము సమైక్య మాప్రజలయందుండున్ ప్రజాస్వామ్య మం
దుకు రాణించు జనాళిగుండియలయందున్ దేశభక్త్యంకురా
లకు తావున్న యదొక్కశోభ నిజముల్ నర్తింప పాలించునా
యకు లున్నన్ పనిలేదుచెప్పగ సమైక్యమ్మున్ ప్రతిష్ఠింపుడీ.

సిరికో దేనికో దుష్టబుద్ధిని కురుక్షేత్రాల సృష్టించి కొం
దరు జాతీయత విస్మరించి సభలన్ గగ్గోలు జృంభింప చే
తురు సద్భావము గోలుపోవుచును చేతుల్ చాచుచున్ కొట్టుకొం
దురు కుర్చీలను లేవనెత్తెదరు తంతుల్ జాతి కాధారమా?

మతముల్ లేవు కులాలు లేవనుచు కుమ్మక్కై దరిద్రావళిన్
ఖతమున్ జేయుదగామనుష్యుల క్రుధాక్రౌర్యంపుచేతల్ పరి
స్థితు లేనాటికితగ్గునో యపుడె సుస్నేహంపు టైక్యమ్ము భా
రతదేశాన రహించు నాపయి ప్రజారాజ్యమ్ము భాసించెడిన్.

నీవొక శుంఠవం చొకడు నీవయె శుంఠ వటంచు నొక్కడున్
కేవల మీర్ష్య లందవిలి కేలులకున్ పని నొప్పగించు దు
ర్భావము పోవగావలయు పాలకులై నటువంటివారిలో
ఈవిధమున్న నెట్లురహియించు సుధాసమతామహత్వముల్.

విమతుల్ ద్రోహపు బుద్ధితో జనులలో భేదాలు గల్పించి దే
శము విచ్ఛిత్తికి పూనుకొందురిది దేశద్రోహమేయౌ క్షమా
ర్హము కాదిద్ది యఖండభారతపు పూరాసార్వభౌమాధి ప
త్యము నెవ్వం డరికట్టు? నేకతకు భద్రంబైన దేశమ్ములో

మును పిచ్చోటను బొక్కసానగల సొమ్ముల్ దోచుకొన్నావు నీ
వని యెగ్గెత్తియొకండు కాదనుచు తావాదమ్ము నొక్కండు చే
సిన నీజాతికి నెట్టు లబ్బును సుఖశ్రీలెన్నగా నోట్లతో
కొనుటన్ గాదు మనస్సుతో కొనవలెన్ గూర్మల్ పిసాళింపగన్.

కన దౌన్నత్యమహోగ్రభూమిమన దీకాశ్మీరభూభాగ మం
చని చాటింపుము వెఱ్ఱిమొఱ్ఱికథలన్ పాటింపగారాదు హె
చ్చిన యైక్యమ్మన నంద టొక్కటిగదేశీయంపు వైశిష్ట్యల
క్షణమున్ దిక్కులదాకగా విజయఢంకా కొట్టుముత్సాహివై.

ఎనభై కోట్లజనాళి గన్నయది మాతృశ్రీ మహాభారతా
వని యెంతో సిరిసంపదావళికి నావాసమ్ము నానావినూ
తనభావాలకు నాకరమ్ము మతసిద్ధాంతాలువేరైన గూ
ర్మినిజూపించి సమాదరించు జనయిత్రిన్ వేడ్కగొండాడుమీ.

శ్రమజీవుల్ నిఱుపేదమానవులు శాస్త్రజ్ఞుల్ ప్రజానాయకో
త్తములున్ ధీనిధులున్ జనాభ్యుదయ చైతన్యమ్ము గల్పించు ను
త్తమకాంక్షామతు లందఱున్ వెరశిమొత్తమ్మందరీ యైక్యయా
గములో భాగముపంచుకొండపుడె పక్కాశాంతి భాగ్యోన్నతుల్.

ఎవడైనన్ కురిచీని యేలగలవాడే? యీప్రజాస్వామ్యమం
దవురా యోడలు బండ్లు నోడ లగుమౌర్ఖ్యంబున్ విసర్జించి మా
నవసూత్రాలకువిల్వ నిచ్చిన సమానత్వమ్ము నైక్యంపు బాం
ధవ నవ్యోదయభావగంధలహరుల్ నల్దిక్కులన్ బాఱెడిన్.

అనగా తప్పనుకోనుచెప్పికొన బ్రహ్మజ్ఞానసంపత్తిగ
ల్గిన సన్యాసి మతాలమక్కువలతో క్లేశమ్ముసృష్టింప నా
తని దుశ్చేష్టలు నాపగా ప్రథమకర్తవ్యమ్ముగా నెంచుచో
గణియించున్ నవభారతావని యశఃకళ్యాణి సౌభాగ్యముల్.

కల్లోలాలను రెచ్చగొట్టి మనదౌ కాశ్మీరభాగమ్ములో
జల్లెన్ ద్వేషపు టంకురాల నొకభ్రష్టస్వాంతు డాతండు మా
నుల్లాఖాన్ సహనస్వభావమునకున్ దూరుండు మర్యాదలన్
ఉల్లంఘించినవానిపై గలుగు నీవ్యూహాలు రాణించుతన్.

ఈపంజాబున శాంతివాయువులు హాయిన్వీచుచో వేలవేల్
దీపాల్వెల్గినచంద మయ్యెడిని యీదేశానహర్షోదయ
శ్రీపంకేజము వేయిఱేకులయి వాసించున్ సమైక్యమ్ము లీ
బాపూజీ వసుధన్జెలంగెడిని యాపైనమ్ము సిద్ధించెడిన్.

ఈకౌటిల్య కుతంత్రచింతనలతో నీలాగువర్తించుచో
పాకిస్థానుపరాభవానలములో భస్మంబగున్ విశ్వమం
దే కోణమ్మననుండి గౌరవమురానేరాదు దౌర్జన్యమెం
తో కాలమ్మువసింపనేరదు కుయుక్తుల్ నల్గి నత్తయ్యెడిన్.

ఈయజ్ఞమ్మును నిర్వహించుటకు వేరేలేరు ఋత్విక్కు లీ
వే, యాగమ్ము నొనర్పజాలుదువు లేవేలాటి పాండిత్య వి
ద్యాయోగమ్ములు, వర్గవర్ణముల ఛాయల్తాకవిచ్చోట గా
నీ యీదేశము నా దియన్నగుణుతుల్నీకున్న నర్హుండవో.

ఆ హ్వా న ము

ఈ టెర్రరిస్టుల హింసావిధానమ్ము
తూలిపోవుచు కుప్పకూలునాడు
ఈ మతస్థుల బుద్ధిలో మలంగిన క్రూర
కర్మకాండలు గంగగలియునాడు
ఈ కులాలపిశాచి భీకరదౌర్మార్గ్య
కార్యాలకు సమాధి గట్టునాడు
ఈదేశ ప్రగతిని నీసడించినజాతి
విద్రోహితతి నేరివేయునాడు

నాడుదేశమందు నవనవోన్మేషంపు
టుజ్జ్వలాభ్యుదయము ప్రజ్వలించు
నంతవరకు నీమహాయజ్ఞమాగ దా
హ్వాన మిదియె యనుజులార! రండు.

28-5-1990



# ఆంగీరస

మారణహోమకుండమున క్రమ్మంది రమాయకులైనవార లే
నేరము సేయనేరని మనీషులు క్రుగ్గిరి మానభంగముల్
నూరులు నూరులయ్యె నవునోయి ప్రజాపతివేళలోన నాం
గీరస! నీ వికేమి? వెలిగించెదవో తెలుగున్ పొలమ్ములో.

బలమున్ గల్గినవానివర్గమె ప్రజాస్వామ్యమ్ముఁ బాలింపగా
వలయున్ తప్పదు వర్గపాలనము ధర్మావే దటంచున్ ప్రజా
వళి పేర్కొన్న నెబానె! యేయుగములో బాగున్నదో చెప్పగా
వలె నాంగీరస! స్వార్థజీవులముతా పాలించు దేశమ్ములో.

చేరెడు గంజినీళ్ళ తమ జేనెడు పొట్టలు నిండువేడుకన్
భారము గాఁదలంచిన జనమ్ముల మండిన గుండెలందు సం
స్కార సుసంస్కృతీ మధురశబ్దములెక్కనె? వక్కణింప నాం
గీరస! యుత్తమాటలివి కేవల మేలెడివారి తంత్రముల్.

ప్రవహింపవచ్చునా వర్ణాలకలహాల
నిరపరాధుల రక్తనిర్ఝరములు
సవరింపవచ్చునా స్వార్థమ్ము కోసమ్ము
భాసించు రాజ్యాంగ శాసనమ్ము

విహరింపవచ్చునా వికటాట్టహాసాన
మత్సరగ్రస్త బీభత్సకాండ
ప్రకటింపవచ్చునా పరుల కమ్ముడువోయ
జాతీయ రాహస్య సంఘటనల

వరుస నీముందు నఱువదివత్సరాల
ఋతుమహారాజు లేతెంచి రెన్నొమార్లు
బాగుచేసినవాడు కన్పడగలేదు
వేడ్క నీరాకతో నెట్టి వింతలేదు.

కులముల్ లేవని గొంతుచించుకొని బొంకుల్వల్కి యాపైని యా
కులపున్ ముద్రల తోడనే పదవులన్ గుర్చీలగూర్చున్న భో
గులకున్ పట్టునె? మంచిసేయుటలు నీకున్ మాకునంతే సలా
ములు నీవెందుకువచ్చినట్లు సెలవిమ్మాయీ! మహాంగీరసా!

అనవద్యప్రతిభావిభాసి! నరసింహారావు పీఠమ్ము నె
క్కిన చారిత్రకఘట్ట మాంధ్రులకు దక్కించెన్ యశోవైభవ
మ్మును దిగ్భూవలయమ్ము జోతలిడ సర్వోత్కృష్టమైనట్టి యాం
ధ్రుని యూహాకిరణప్రణాళికలు కూర్చున్ జాతికౌన్నత్యముల్.



# నెహ్రూ

ధీ జాగ్రత్ ఋజువర్తనుండయిన మోతీలాలునెహ్రూ కుమా
రా! జహ్వార్ భువనాలు మ్రొక్కిడునయ్యా! నేడు నేనాడు న
వ్యాజంబైనటువంటి నీయసమదివ్యంబైన త్యాగానకున్
పూజార్హాలు భవత్క్రియాపథకముల్ పూర్ణస్వరాజ్యాశయాల్.

నిఖిలార్ష భువిని వందేమాతరం ధ్వాన
ములు నాల్గుదెసలు మార్మ్రోగువేళ
బ్రిటిషువాని యినుప కుటిలధూర్త మహోగ్ర
శాసనాల్ జాతిని చమురువేళ
దాస్యశృంఖలముల దన్ని భారతజాతి
చైతన్యశక్తులు సాగువేళ
అరసాన దేశభక్త్యావేశ పరులెల్ల
చెఱసాల బువ్వ భుజించువేళ

బక్కచిక్కిన వార్ధతపస్వి యొకని
పలుకులోని నిజాయితి విలువదెలిసి
అతని అడుగులలోన నీవడుగువేసి
నెగడినావు స్వరూపరాణీ తనూజ!

నీ యావేశము మానవత్వము పయి న్నీకున్న ప్రేమమ్ము నె
హ్రూ! యింతింతని చెప్పగా దరము గాదోయీ భవజ్జన్మచే
నా, యీ దేశము ధన్యమైనది శరణ్యంబైన నీయూహలే
శ్రేయంబున్ పొనరించి నేటికి ప్రశ_స్తింగాంచు దేశాలలో.

జహ్వారు! భారతభువిలో
విహ్వాలమతులైన బీదబిక్కులకు సదా
బహ్వాధ పథకములబ్బెను
వహ్వా! నీ దూరదృష్టి ప్రణుతింపదగున్

గాంధిజీ పర్యవేక్షణలో విమర్శనా
దృక్పథమ్ములను నేరిచిననాడు
విశ్వకవీంద్రుని విజ్ఞానవాహినీ
సలిలాల స్నానమ్ము సలుపునాడు
తండ్రి మోతీలాలు ధర్మశిక్షణ కళా
శాలలో పాఠాలు సదువునాడు
పాశ్చాత్య దేశాల ప్రగతి యీదేశాన
తాండవింపగ దిద్ద తలచునాడు

ఎన్నొ శ్రమల నోర్చి యీదేశ ప్రోజ్జ్వలో
జ్జ్వలపు భావి కొఱకు శాంతి కొఱకు
నడుముగట్టి కంకణము దాల్చినాడవు
సీమభూపతులకు జిజ్ఞతిరుగ.

ఆహ్వానము

జనులే పాలకులైన యట్టిది ప్రజాస్వామ్యమ్ము వర్ధిల్లగా
తను వర్పించినత్యాగమూర్తివి! యథార్థంబిద్ది చెప్పన్ జగ
జ్జనకుండౌ మునిగాంధి దీవనల రాశిన్ గొంచు నీభారతా
వని కీర్తిప్రసవాల్ పరీమళము దిగ్భాగాలఁ దాకించితో.

నీ వవతారమూర్తివని నిన్నుగుఱించి తపస్వి చెప్పితా
నావల లోకము న్విడిచె నాయనగారును వారి నెచ్చెలుల్
ఈవిధి కబ్బురంపడిరి యీవుజనించుట మాయదృష్ట మ
య్యా! వెనుకంజవేయని సదాశయమూర్తివి నీవుజహ్వారూ!

వితతీయంబగు కీర్తిదెచ్చినది యీ విశ్వప్రపంచాన భా
రతదేశానకు నీప్రణాళికలు నీ రమ్యోహలే సుమ్మి! నీ
యతిలోకజ్ఞత మానవీయత జగంబందెప్డు నిల్చుండు సం
స్తుతికిన్ పాత్రుడ 'ఇందిరా'జనక నీసొమ్ముల్ జగత్క్షేమముల్.

వరచైతన్యమునింప నీదగుచితాభస్మమ్ము నీదేశసా
గరతీరాల నదీనదాల కలసెన్ గాంధీ క్షమాశాలి శి
ష్యఱికమ్మున్ తలదాల్చి వర్తిలిన చాచా! నెహ్రూజీ! నీహృదం
తరవిశ్వాసము నేడుదెబ్బతినె వర్ణప్రక్రుద్ధజాడ్యక్షితిన్.

అంతిమ శ్వాస యతని కున్నంతవరకు
ఖరుచు పెట్టెను సర్వ లోకాలకొఱకు
అతడు 'రాజీవుగాంధి' నీ యనుగుసుతకు
పుత్త్రుడాతడు త్యాగాల పుట్ట లీరు.

14-11-91

# సమాలోకనము

ఇది తెలుగు శ్మశానధరిత్రి యిది తెలుంగు
నరకభూస్థలి యిది తెల్గునందనవని
అసలు మన మెక్కడున్నామురా! ధరిత్రి
నాత్మ దలపగ నాఱుకోట్లాంధ్రులార!

కనులన్ విప్పిన మూసినన్ గనబడున్ గాంధేయ మార్గాన చిం
తనసాగించు నఖండదేశమున గూండాలేలు రాజ్యాన మా
రణహోమమ్ము క్షణక్షణ మ్మిదిర ధూర్తంబైన లాకప్పు లె
న్నని వాచింప తరమ్మిటులెయున్నన్ దేశమే మౌనుకో!

బాగము లేని జీవనము సల్పి కుతంత్రపు బుద్ధితో ధన
మ్మేగతి దోచుకోవలయు నిప్పుడు నీనిఱుపేద వారి నే
లాగున ద్రిప్పుకోవలె దలంపుల తంతులలోనమున్గి దై
లాగులు చెప్పుచోగలుగు లాభమదేటికి జన్మభూమికిన్.

నేను సహింపనేర నవినీతి నటన్న పదమ్ము విన్న నా
మానస మెల్ల క్రుంగు నవమానమునాకు కులమ్ము పేరుతో
దీనుల ద్రొక్కివేయుటలు దేహము త్యాగము కోసమే యనం
గా నిది యేటిసాధ్యము దగావచనాలు సముద్ధరించునే?

# ఆ హ్వా న ము

అంతర్యమ్మదె సాక్షిగాగ ప్రజలారా! చెప్పుచున్నాడ నే
కొంతైనన్ సుఖమున్ త్యజించి సుకముల్ గూర్పింతు విశ్వాన కం
చెంతో పొర్లిన దుఃఖబాష్పములతో నీవేళ గన్పించు వా
రెంతోమందిగలారు నమ్మకము భాయీ! నీకు మేలయ్యెడిన్.

సత్తువ లేని సత్తులకు జాతర సల్పి వివేక హీనపున్
మత్తు మతాల నమ్ముకొని మానవతన్ దిగద్రోచి హింసతో
పొత్తు కుదుర్చుకొన్న జగమొండి మతస్థులలోన శాంతి ద
శ్శాక్తిన విశ్వలోకమునకున్ కలుగున్ శుభసౌఖ్యసంగతుల్.

నిరసించునా ప్రజానేతరాజ్యమ్ములో
పేటురేగిన పైరవీలబెడద
దరిసించునా ప్రజాదర్బారులో నాయ
కుడు పేర్మిమై పేదగుండెలోతు
ఆరసించునా పాలకాగ్రేసరుడు ప్రతి
భాశాలి ప్రతిలేని భావపటిమ
పరపించునా యేలుబడిసేయువాడు దే
శప్రజాహృది పృథ్వి శాంతిగంగ

కూడు గుడ్డ గూడు కొదవైన పేదప్ర
జాళి యార్తరావ మాలకించు
నా? యథార్థమైననదియ దేశానకు
చాలవేల దివ్వటీల వెలుగు.

చరణము వెట్టి యిక్కడొక శాసనమున్ నిలిపింపవచ్చు సం
బరములు సేయవచ్చు నవి పత్రికలందు పతాకశీర్షికా
దరమును పొందవచ్చు నిదిధర్మయుతమ్మె? యధర్మ మన్న నా
చరణము లోనపెట్టక ప్రజన్ గమనింపకపోవు టేసుమీ!

ఇది యాధ్యాత్మిక దేశమే యయిన గానీ సంస్కృతిం గల్గిన
ట్టిది గానీ భువనైక కీర్తిగలదై శోభిల్ల దర్శించున
ట్టిది గానీ కులపున్ పిశాచమును గెంటింపింపగా జాలెనే?
ఇదిరా! పుణ్యపవిత్ర భారతము నందీ నాటిభాగోతముల్.



# అష్టదిగ్గజకవి సన్మానము

చాలన్ వేలయుగాల నీస్మృతులదౌష్ట్యంబైన చట్టాలబం
దీలై నల్గినవారి నాలుకలపై నృత్యమ్ము గావింప నీ
వేళన్ రమ్యకళామయూరి పురివిప్పెన్ కాలవేగమ్ములో
కూలీవాడు కళాప్రపూర్ణుడగు వెల్గుల్ జిమ్మియాంధ్రక్షితీ!

ఇది యానందము క్రుమ్మరించిన దినం బీనాడు సాహిత్యసం
పదకోటీశుడు జ్ఞానపీఠి ఘనసన్మాన్యుండు నారాయణా
ఖిధ రెడ్డీంద్రుడు సింగిరెడ్డి కులు డీవిశ్వంభరా కర్త నె
మ్మదిలో పండిన మేల్ మహోహాలు తలంపన్ జాతిగర్వించెడిన్.

మహిత స్వాంతుడు మానవేంద్రు డనవేమారెడ్డి భూజాని తా
రహిగల్పించె నఖండభోగము కవీంద్రశ్రేణి కానాటి యా
స్పృహకున్ మచ్చగ వారసత్వముగ నేడీవిశ్వవిద్యాలయం
బహహా! నిల్చి రహించెబో తెలుగుకల్యాణీ! పురంధ్రీమణీ;

నాలవ జన్మవత్సరమునన్ పదమూని యఖండభారతీ
మౌల ప్రసిద్ధసత్కవుల మోహనకావ్య సుమాలనుంచి దే
శాల పొగడ్తలన్గొని విశాలమనస్విగ తెల్గువిశ్వవి
ద్యాలయ మిట్లు వెల్గుట మహాంధ్రుల భాగ్యము లాంధ్రభామినీ!

## అష్టదిగ్గజకవి సన్మానము

ఘనుడౌ నీలమువంశశేఖరుని దీక్షాదక్షుసంజీవరె
డ్డిని రప్పించి బహూకృతుల్సలిపి రూఢిన్ తెల్గుభాషా చరి
త్రను సృష్టించిన నీమహోన్నత పవిత్రంబైన భావాలు మె
చ్చని వాడుండునె? తెల్గుసత్కళల కాస్థానంబ! విద్యాలయా!

కలితీలేని యథార్థవర్తనుని రక్తత్యాగదీపాల కాం
తులకాంధ్రక్షితి యేరుపడ్డది మహాంధ్రుల్ జాగృతింగొన్నవా
రలు నీపుత్రులుసత్కళాప్రియులు మర్యాదస్థులైక్యమ్మునన్
గలమాధుర్యము నాస్వదించెడు రసజ్ఞశ్రేష్ఠు లాంధ్రావనీ!

తెలుగుల్ విజ్ఞులు వారి మానసపు టుద్దేశ్యమ్ములేవేరు వా
రల కానందముగల్గుచో నదొకదర్జాహేల కాకున్నచో
జ్వలితజ్వాలమహాగిరీంద్ర సదృశుల్ చచ్చైన బైరాగి చి
ట్కాలకున్ లొంగనివారు నీయనుగుబిడ్డల్ దివ్య దాంధ్రేందిరా!

పేర్గన్న కవులను పేర్మి నాహ్వానించి
యుచిత సత్కారమ్ము లొసగునాడు
లలితకళాసమగ్రుల హృదంతరములో
నానందఝురులు పొంగారునాడు
చదువుసంధ్యలులేక బ్రదుకు సాగించు ని
రక్షరాస్యులు విద్య లందునాడు
పరిపాలనము సేయు వానిస్వాంతాన వి
శాలభావపు దివ్వె లేలునాడు

## ఆ హ్వా న ము

నాడు తెలుగుజాతి నవనవోజ్జ్వల నవో
న్మేష పథమున బయనించు తెలుగు
ప్రాభవాలు దశదిశాభిత్తికల దాక
దివ్యభావవల్లి! తెలుగుతల్లి!

2-12-1989



# విభవ

ఈ సర్వంసహా నేడజూచినను లేనేలేవు సౌహార్ద చాం
ద్రీసారల్య సుమాలసంహతుల రాణింపుల్ పిరాయింపు లం
దాసక్తిన్ తెగజూపు జాతికి వినూత్నాబ్దప్రభూ! కల్గునే
కొసంతైనటువంటి యభ్యుదయదీక్షారంభ సంరంభముల్.

గౌనబున్ మేల్మికి మాఱుగా తఱచుగా కుర్చీల యుద్ధాలు సా
గిన సర్వోన్నతశాసనాలసభలో క్రీడించునే శాంతి జీ
వనచిహ్నంపు కపోతముల్ సకల విశ్వంబందు పేర్గన్న ధా
త్రిని యీకొంచెతనంపుచేష్టలు సమర్థింపన్ క్షమార్హంబకో

కనుల న్విప్పిన మూసినన్ శవములే కన్పట్టు నీమౌని భూ
మిని దుష్టంబగు రాజకీయములతో మిన్నంది గూండాయిజం
బునకున్ మద్దతు నిచ్చుదేశమునకున్ పూర్ణస్వరాజ్యమ్ము ని
ల్చునో? లేదో! విభవా! యెఱుంగగలవంచున్ విశ్వసింతున్హృదిన్.

చదువు సాములలోన యాచనములోన
అతివివేకమ్ము సూపిముందడుగు వేయు
వర్గమున్నట్టి వసుధను భర్గుడైన
సిరిమగండైన విభవ! రక్షింపగలడె?

రా! మా యాంధ్రజనాళి చూచుటకు చైత్రస్యందనంబెక్కి యెం
తో మర్యాదలభించు నీకిచటనాంధ్రుల్ సేయునాతిథ్యముల్
ఆమూలమ్ముగస్వీకరించు విభవా! యాపైని నీచిత్తమె
ట్లో యాంధ్రులమీదనట్లగునటం చూహింతువర్షాధిపా!

ఒక్కడాంధ్రరత్న మొకడాంధ్రకేసరి
యొకడు పొట్టిరాము డొకడు బులుసు
త్యాగమూర్తులీమహాంధ్రాన మసలగా
వలయునపుడె విభవ! తెలుగువిభవ!

ఈ హింసాపథరాజకీయముతోనే తెల్లవారన్ మరే
దీ హిందూక్షితికిన్ విముక్తి విభవా! యేవ్వాడు పాలించినన్
మాహాత్మ్యమ్మునుకూర్చిపెట్టగలడే? నానాక్రతుధాభావనా
ద్రోహస్వాంతులు కల్గుదేశమున విద్యోతించునే భాగ్యముల్.



# ఈ దీపావళి వేళలో

ఈ నా మాటల తప్పుపట్టకుముతల్లీ! నాడుసత్యావతీ
సూనుం డానరకుండు దేవతలకున్ శూలమ్ముగా నిల్చెగ
ర్వానన్ వానినిద్రుంచె సత్యవతి "బోఫర్స్"లో "ఫెయిర్‌ఫాక్సు"లో
లీనంబై నటువంటి నారకుల ఢిల్లీ! యెట్లుశిక్షింయునో?

అపుడు నరకుండు మరణించి నందువలన
సాగె దివ్యదీపావళీసంభ్రమమ్ము
ఇప్పు డీకుంభకోణాల తప్పువలన
శాంతిదేశమ్ములో నలజడులురేగె

ఈదీపావళి తంతులో నిజముగానే దిక్కులేనట్టి యీ
పేదల్‌గుండెలలోన సంతసపు దివ్వెల్ వెల్గునే? యార్షధా
త్రీదాక్షిణ్య ఝరీతరంగములు దిగ్దేశాలకుంబారునే?
ఏదోపుక్కిటగాథలో మసలినామేమో? విచారింపగన్.

ఎవ్వరైననేమి యీ నాప్రజావళి
గోడువినుచు కూడు గుడ్డ కొంప
యియ్యగలిగెనేని యేల్బడి నేయగా
వలయు లేదొ? పదవి వదలవలయు.

## ఆ హ్వా న ము

కరవుల్ కాటకముల్ దరిద్రతలు నేకమ్మై క్షమాఖండపున్
పరువున్ తీయుచు నున్న వేళ నిక బాణాసంచులంగాల్చి సం
బరపడ్డన్ ఫలమేమి? విశ్వసకలప్రాణుల్ సుఖంబొందు చే
పరితోషమ్మగు తల్లి! నీకవియె దివ్యద్దివ్యదీపావళుల్,

2-10-87



# ప్రభవ

ముజ్జగాలు మహాంధ్రమున సాగుపథకమ్ము
అనయమ్ము గాంచి కొండాడునాడు
భువనాల తెలుగుల్ల కవనాలవిజయాలు

ముదమారగా మారుమ్రోగునాడు
తెలుగుదేశస్ఫూర్తి దిగ్దిగంతాలకు 

శ్రీకారములుచుట్టి ప్రాకునాడు
తెలుగువైభవదీప్తు లలరార వినుప్రోలు 
తెలుగుసిదమ్మును నిలుపునాడు

ప్రభవమందు నాడు స్పష్టమైనట్టి శు
భాలు సంతసాలు ప్రభవ మాకు
నీహయాములోన నిండారగా మేలి
తెలుగు లలిత కళలు వెలుగనిమ్ము

నాకీ కోకిల కాకళీ ధ్వనులతో నాకీ మనోజ్ఞంపు పే
లాకమైక్యవసంతగానములతో లావణ్య లీలాకళా
శ్రీకారమ్ములుగల్గు నీప్రకృతిలో లేదింత బంధమ్ము నా
యాకాంక్షల్ ప్రభవా! దరిద్రజనసౌఖ్యంబున్ సమర్థించు తే!

ఆ హ్వా న ము

శ్రమలన్ మోసినవాడు నాడొకడె నిర్ధారింపగా నాంధ్రర
త్నము నే దందఱునాంధ్రరత్నములె రత్నార్థమ్మె లీరూపమె
త్తి మమున్ భీతిని ముంచిపైచె ప్రభవా! తెల్గుల్ మహోదారు లిం
క మరేమందు సరేసరే యనెద వ్యాఖ్యానమ్మె వ్యర్థమ్మగున్.

శ్రమజీవులైన కర్షక కార్మిక జనాళి
గుండెలో నమృతమ్మె కురియునాడు
పెంటప్రోగులనెత్తి వీథు లూడ్చినవారి
పెదవిలో చిఱునవ్వు కదలునాడు
మంచినీటికి బిక్కుమంచు నేడ్చెడివారి
తలపులో సంతృప్తి కలుగునాడు
గద్దెనెక్కిన మొనగాండ్రు పాలితులను
హృదయపూర్వకముగా నేలునాడు

ప్రభవ! నాడు నీరాక పర్వమ్మె మాకు
అంతియే కాని యీలాటి తంతువలన
నేప్రయోజనమును గూర్తు వీప్రజాళి
కయినవచ్చితి వందుకో స్వాగతమ్మ.

కడుదూరమ్మున నాగె గాంధిపలుకుల్ కాగా ప్రజాస్వామ్యమ
మ్మెడువోయెన్ మఱి యెట్లునిల్చునిట సంపూర్ణస్వతంత్రమ్మ గి
ద్దెడు సారాకొక యైదురూప్యములకున్ ధీమాగవర్తింప నే
ల్చడి నీవెట్లుపొనర్తువో తెలియదప్పా! నూత్నవర్షప్రభూ!

గెలుపుపొందినవాడు గెలువనివానికి
అభినందనముచెప్పు నపుడుగాని
కలిమిగల్గినవాడు కలిమిహీనుని కింత
యాదరణముచూపు నపుడుగాని
అధికారి తనక్రింది యధికారులను సమ
త్వాభిమానముజూచి నపుడుగాని
కులగర్వమున జిక్కుకొన్న వానియెడంద
అనురాగ ఝురి పారునపుడుగాని

ఈ ప్రజాస్వామ్యమున కర్థమేమి ప్రభవ!
చక్రపున్ పరిభ్రమణాన సాగునట్టి
నీదు రాకడ తెలుగులలో దిగాలు
కానరాదని తలతుయుగాదినేత!

నా భాషాప్రతిభామహత్తకు రసజ్ఞగ్రామణుల్ మెచ్చి వ
హ్వా! భేషంచు వచించి యావల కులవ్యత్యస్త నైచ్యంపు శా
ఖా భేదాలకులొంగియాడు గరువన్ కర్మప్రదేశాన గాం
ధీ భావాలకు చెప్పగా ప్రభవ! లేనేలేదు తావిచ్చటన్.

ఈ నామహాంధ్ర మహీతలమ్ముల నెల్ల
విమలశాంత్యనిలమ్ము వీచునాడు
ఈ నామహాంధ్రుల మానసమ్ములలోన
ప్రేమభావము అంకురించునాడు

## ఆ హ్వా న ము

ఈ నామహాంధ్రభాషానూనసుమగంధ
ములు దిశావలయాన మలగునాడు
ఈ నామహాంధ్ర సంస్కృతిమహోజ్జ్వలముగా
దశదిశాభిత్తికల్ దాకునాడు

నాడు నాతెల్గుతల్లి విన్నాణ మెసగ
వినుపథానకు తలయెత్తు కొనుటనిజము
ప్రభవ! నీరాక నామహాంధ్రజనహృదయ
పీథి హర్షంపువెన్నెలల్ విరియుగాక

30-3-87



# సందేశము

హైందవ సామ్రాజ్య మవతరింపగగొట్టె
జేగంట తొలి శివాజీ ప్రభుండు
బెదురు సుంతయులేక నెదిరించె శాత్రవ
సైన్యాలు హడలెత్త ఝాన్సిలక్ష్మి
క్విట్టిండియా నవోద్దీప్తప్రబోధాల
ప్రజల మేల్కొల్పె వార్ధాతపస్వి
ఆంగ్లభూపతుల దౌష్ట్యముద్రిప్పికొట్టు భ
గత్సింగు ఘను డురికంబమెక్కె

ఎందఱో త్యాగ ధనుల లోహితము ధార
లై స్రవంతులై పారి యార్ద్రి మొనరించె
జాతిహృదయమున్ చైతన్య శక్తినిచ్చి
ఆమహాత్ముల నీడలో నలరువలయు.

దిక్కుల్ కంపిల వీరగీతములు వందేమాతరం ధ్వానపున్
ఋక్కుల్ వేదము వోలె నాదమిడగా నేభేదముల్లేక భూ
భుక్కుల్ హూణుల గుండెచిల్లువడగా పూర్ణంపుజాతీయతా
దృక్కుల్జాటిన దేశభక్తుల పథంచే నీకునాదర్శమౌ

ఆ హ్వా న ము

ఇవి హిమాలయములు వివరించు నీజాతి
ప్రత్యగ్రమౌ మహౌన్నత్యచరిత
ఇవి గాంగజలములు సవరించు నీదేశ
కల్యాణములకు బంగారుపంట
ఇవిక్షేత్రరాజాల సవనాలు పలికించు
విశ్వక్షమాశాంతి విమలవాణి
ఇవి త్యాగమూర్తుల ప్రవిమలంబయిన ర
క్తత్యాగదీపాల ధర్మకాంతి

ఎవరి జీవితమ్ము లేరీతి వైనను
జాతి సమతకొఱకు సాగినార
లేకబాటజనము లీమహాభారత
చరిత గొప్పదనుచు జాటవలయు



# శింజిని

ధనము గడించి మైమఱచి దర్పముతో జరియించి సాధుజీ
వనులను గష్టపెట్టి తమపబ్బమునెట్టుక పోవుటే సుఖ
మ్మని యెదనెంచు దుర్మతుల మౌఢ్యము బ్రద్దలుసేయు శింజినీ
నినద మఖండభారతము నేటికినైన బురోగమింపగన్.

కులసంఘాలను ప్రోత్సహించుచు కుయుక్తుల్ పన్ని స్వార్థమ్ము గుం
డెలలో దాండవమాడ సత్యమును బందీసేసి బాపూజి వా
క్కులు దూరానకునెట్టి మిట్టిపడు మూర్ఖుల్ శింజినీధాటికిన్
బలియైపోదురు సత్యవంతులమనోభావమ్ము సిద్ధింపగన్

క్రుద్ధ విద్వేష జోగ్రోద్ధతోగ్రంపశ్య
చిత్తమ్ము లేకమై చిట్లవలయు
కులమతోన్మాద శక్తుల ఘోరదౌష్ట్యమ్ము
మొత్తమ్ము భూమిలో పూడ్చవలయు
కుటిలప్రయోగాత్మకులగు ప్రజావంచ
కశ్రేణి క్రియ లరికట్టవలయు
సంక్లిష్టహృదులు దేశద్రోహివితతిదు
శ్చేష్టితమ్మును చీల్చిచెండవలయు

ఆ హ్వా న ము

నలుగ గొట్టవలయు నయవంచకులు నేయు
సిగ్గుచేటులేని చెయిదములను
శింజినీ ప్రళయప్రభంజనరూపమ్మొ
దాల్చ వలయు చెడును గూల్చవలయు

ధర్మమవల ద్రోసిదౌర్జన్యమును రేపు
తుంటరుల యెదలకు వింటినారి
శింజిని; సమతమ్మొ క్షితి గోరువారికి
శింజిని; రసగాన శీకరములు.

14-5-85



# అరసిక భూమి

ఒకని గొప్పదనము నొకడు విద్వేషాన
వంచనమున మివుల పాడుసేయు
సంగనాటిభువిని నైసర్గికస్నేహ
ధర్మగంధ మెటుల తాండవించు.

ఒకచక్రవర్తి కీర్తికి పొగిలియొకండు
కేలుసాచె రవంత నేలకొఱకు
ఒకధనుర్ధారుని నొకడు వాంఛించెను
ముష్టిగా కుడిచేతి బొటనవ్రేల
ఒకమహాదాత గొప్పకు నేడ్చియొకడు హ
స్తముజాచె జలకాల సమయమందు
ఒకరాజరాజు నీతికి పండ్లుగొఱికి యొ
క్కడు రేపె తీరని కలహమొండు

ఒకని యుజ్జ్వలంపుటున్నతికిన్ దుఃఖ
పడి యసూయగలుగు వారలున్న
పరమ హీనమైన యరసికభూమిలో
ప్రతిభకెట్లు గౌరవమ్ము కలుగు

ఆ హ్వా న ము

తనువుపొంగగజేయు నట్టి విలువిద్యాశారదామూర్తు లుం
డిన నిండారు సభాప్రదేశమున గుండెల్‌నిండు ద్వేషాగ్నితో
ఘనుడైనట్టి ధనుర్ధరున్ తెగడు సంస్కారమ్ము నుంగల్గుహీ
మునకున్ దోసిలియొగ్గు దేశమున విందుల్‌సేయునే సత్కళల్.

ప్రవహించు నిచ్చోట ప్రకృతిగర్భముమీద
పరమపావనమైన స్వచ్ఛగంగ
ధ్వనియించు నిచ్చోట ననిశంబు మండూక
శబ్దాల నాగమోచ్చారణమ్ము
ఫలియించు నిచ్చోట బహుళతరకుజాల
రసమసృణఫలైక విసృతవితతి
లభియించు నిచ్చోట ప్రభలెగజిమ్మ వ
జ్రసువర్ణఘనలోహ సంచయమ్ము

ఇదియ ఋషిసంప్రదాయమౌ పృథివి యనెడు
గడనకెక్కినదేశమ్మె గాని యేది
సమత? వర్ణాల ధీబలచాకచక్య
మునకు లేదేమితిండి? కారణదేమి?

అరసికులైన వారలకు నంకితమిచ్చిన భాగ్యరేఖ నా
శిరమున వ్రాయబోకుమని చెప్పిన యక్కవి యెంతగా వ్యథా
భరిత మనస్కుడయ్యెనొ? వివాదములేల? కళాసరస్వతీ
చరణముమెట్టుచోట విలసన్నవసంస్కృతి నాట్యమాడెడిన్.

కడుపు కక్కుర్తికై వర్ణకాంస్యకుడ్య
ములను నిర్మించి యితరులతెలివితేట
లేటిగలిపిన వార లీపాటియందు
బ్రతుకుచుండుట దేశ దౌర్భాగ్యమదియ.

పారోదాత్తకవిత్వసుందర మహాసౌధమ్ములో శాశ్వత
స్ఫా రౌజ్జ్వల్యయశమ్ము గాంచకుహనా సారజ్ఞులూహింతు ర
వ్వారల్ సత్కళకేమిసేసెదరు శాల్వాకప్పి శంసింతు రీ
తీరుల్ పూర్తిగపోవుచో గళకు నుత్తేజమ్ముసిద్ధించెడిన్.

ఉన్నవాడు కళల కున్నిజమారయ
తనదుగొప్పకొఱకు తృణమొ పణమొ
విసరువేయునంతె పసయెఱింగియకాదు
వీడె దాత కళకు ఱేడొకండు.

దిక్కును మొక్కులేని కడుదీను డొకండుకులాలయూబిలో
జిక్కి సరస్వతీకరుణచేత మహాకవియై సమాజమున్
ద్రొక్కి యఖండసాహితికి దోహదమిచ్చెరసజ్ఞుడేడి? వా
డెక్కడ? యున్నచో సుకవికేది శరణ్యము? చర్చసేయగన్.

ఎంత తన్నుకచచ్చిన నీకులమ్ము
లీ యరసికులు గల్గు మహీతలాన
కులము బట్టియె గౌరవమ్ములు లభించు
కులము ననుసరించియె పదవులు లభించు.

## ఆహ్వానము

పసిగల సంస్కృతిన్ గలుగుసత్కవికిన్ గళకల్గు వానికిన్
విసపు కులాల మధ్యమున వీసముజీవనరేఖలేనిచో
కొసకు రహింపదెప్పటికి కుంభిని యీనిజమున్ గ్రహించి యీ
రసికులటన్నవారి తలవ్రాతలు మార్చినచో శుభంబగున్.

29-5-92



# సమత

ఇది ఋషిఖండమే హిమగిరీంద్రముపై నటరాజు తాండవా
భ్యుదయ మహోన్నతస్థితికి భూమికయైన ధరాతలమ్ము సు
మ్మది! యిదివేదనాదములహేలకు స్థానమె! దేవతాళికిన్
సదనమె! యైన నిచ్చట కనంబడవింత సమత్వరాగముల్.

సృష్టికి ప్రతిసృష్టి చేసి యొక్కఁడు పేరు
          గొనె విరించికి గూబగుయ్యమనగ
శివజటాజూటాన చిందులాడినగంగ
          మరుభూముల కొకండు మసలఁజేసె
అంభోధి నంతయు నాపోశనముచేసి
          యొకడుగఱ్ఱునద్రేన్చి యొప్పినాడు
అన్నార్థులైన మున్యాశ్రితులకు పొట్ట
          నింపి యొక్కర్తు రాణింపు పొందె.

వీర లందఱుమఱిగొప్పవారె భువికి
కలిగినదే? సుంతయున వీరివలన సమత
ముదిరిపోయిన యసమాన ముష్కరత్వ
కులపుదయ్యాలుజృంభించు తలమునందు.

ఆ హ్వా న ము

వక్తలు భావిభారతపవిత్రక్తలు మౌనులు వారి దౌసుధా
పోత్రము లీయజాండమును బొత్తిగ మార్చినదేమి? యేమహా
శక్తి నిజాన కీయసమసాహసభీకర రాక్షసాధమున్
ఫక్తుగ గూల్చునట్టి తరుణంబిట కెన్నడు వచ్చునో కదా!

ఇటయజ్ఞాలవరాలఘోషణలతో నెల్లప్పుడీచోట నిం
డుట మామూలయిపోయె మానవతయందున్ జేతలందున్ బహు
స్ఫుటనిష్ఠాపటిమమ్ము శూన్యమగు నీభూమిన్ సమత్వంబునె
ప్పటికైనన్ రహియింప గల్గిన మహాభాగ్యమ్ము నాజాతికిన్.

పొరుగు వాని బ్రతుకు పెరిగెడు తరుణాన
సంతసింప కేడ్చి సతమతమగు
దుర్విదగ్ధులున్న యుర్వి నాలోకింప
సమత నిలువ గలుగు స్థానమేది?

తాపసిగా చికాగోపట్టణమునందు
స్వీయభూమికొొకందు స్వేచ్ఛదెచ్చె
జన్మభూమితరింప సర్వవిశ్వంభర
పరిణుతింప నొక్కడు రచనజేసె
లోకమ్ము మెచ్చ స్త్రీలోకమ్ము బ్రతుకున
కమృతధారలొకందు నందజేసె
జన్మధాత్రిని ప్రపంచమ్ము మొక్క శాంతి నా
దాల నొక్కడు స్వతంత్రంబు నిలిపె

ఈ మహానుభావుకుల యహీన దివ్య
దుజ్జ్వాలాశీస్తరంగమ్ము లొనర హిందు
భువన గర్భమ్ములో పొంగి పొరలు చున్న
నేదిరా? సమత్వంబెట కేగెనొక్కొ?

మతవైషమ్యములున్ గులాలగొడవల్ మర్యాదభంజించు సం
గతులొముష్కరరాజకీయములు పక్కాస్వారిసల్పన్ జగ
ద్ధితకార్యమ్ములు సాగునే? యెటులపూయింపించు దేశాన గ్రు
ద్ధతమాన్పించి ధరాసవిత్రి ప్రజ డెందాలందు సోదర్యతల్.

ఎవడాలోచన జేసె నీధరణియందీ లాటియుద్రిక్త సం
భవకార్పణ్యము లీవిభేదములు సంప్రాప్తించు నంచెంచి హైం
దవధాత్రీస్థలి వానిమూలమున నానావర్గభేదాల మా
నవ సంహారము సాగుచున్నది సమానత్వమ్ము దుఃఖింపగన్.

పూరికొంపల వాసముండు పంచమజాతి
యక్షరాస్యతగల్గి యలరువేళ
సాబర్మతీ మునీశ్వరుని సిద్ధాంతమ్ము
భరతభూముల యందుదిరుగువేళ
రాజకీయాల తంత్రాల కుతంత్రాల
వ్యాపాది తలయెత్త నట్టివేళ
అధికారితనదు కార్యాచరణమునందు
ఋజుపద్ధతులను గుర్తించువేళ.

ఆ హ్వా న ము

ఉన్నవాడులేమి నున్నవానిని గాంచి
సానుభూతినింత జరుపువేళ
మానవతకు మజీసమత్వసంసిద్ధికి
విలువకలుగు దారికలుగుగాక!

23-9-1983



# శ్రీ సర్వారాయ శతజయంతి

మీరుచేసినట్టి మేలిమికార్యాలు
నిలిచిపోయె భువనతలమునందు
మీదు శతజయంతి వేదాల పండుగ
సాధుగేయ! బుచ్చి సర్వరాయ!

మీరు జమీనుదారులు నమేయగుణాఢ్యు లుదారు లుజ్జ్వలత్
స్ఫారమనోజ్ఞభావులరు సత్కవిపండితబృంద నవ్యమం
దారులు దీనరైతుజనతాపరిపోషులు భక్తసాగరుల్
మీరలు సర్వరాయ లివి మీచరితల్ కపిలేశ్వరాధిపా!

అకలంకోజ్జ్వల సచ్చరిత్రగల మీయాస్థాన హైమంపువే
దికపై భారతి నాట్యలక్ష్మలు సముత్తేజాన మీరిచ్చుకా
నుకలన్ పొంది కృతార్థతన్ బడసి రాంధ్రుల్ మెచ్చుకొన్నట్టి కీ
ర్తికి ధర్మాచరణాన కీరలకు నీరేసాటి భాషింపగన్.

ప్రియమారగా నిరుపేదరైతుల ఋణ
ములను మాఫీ సేయగలుగునాడు
రహిని విద్యాగంధవహుడు పంచారింప
విద్యాలయముల స్థాపించునాడు

ఆ హ్వా న ము

ప్రజలు కొండాడ నిష్పాక్షికమ్ముగ మహో
    తృప్తి జిల్లాబోర్డు నేలునాడు
ఖ్యాతినినాదాలు మార్మోగ దిగంతాల
    వైనమ్మునకు సాయపడిననాడు

శ్రీయుత శ్రీబులుసు వంశశేఖరా! మ
హామనీషి! మీరలు చేసినట్టి పుణ్య
కర్మధర్మాచరణ యోగ్యకాండ కివియె
శతజయంతి నివాళులు సర్వరాయ!

సచివోత్తముడు బుధశాలి మీసుతులలో
    ప్రథముండు పట్టాభిరామరావు
రెండవ కొమరుండు శ్రీచలపతిరావు
    ప్రముఖుడౌ ఘనపరిశ్రమలవేత్త
మూడవపుత్రుడు మోహనరావు మీ
    సన్నిధానమున నేడున్నవాడు
నాల్గవసుతుడు విజ్ఞానంపు సంస్కృతిన్
    పోషించు సదయుండు బుచ్చికృష్ణ

దేశసేవలో కాకలు దీరినట్టి
త్యాగమూర్తులు మీదు నందనులు, నిలుచు
మీదుకీర్తిసౌధమ్ము భూమీతలాన!
అసమనేత్రు ఢక్కా మ్రోగునంతవఱకు.

కాయము పొంగగా తనకుగల్గిన ద్రవ్యము వేదశాల సు
శ్రేయముకోసమై ఖరుచుసేయును సంస్కృతిపట్లనప్లై తా
చేయివిదుర్చు దానగుణసింధువు మీకొమరుండు సత్యనా
రాయణరావు చంటిదొర యారయ మీసుతు లెంతధన్యులో.

ప్రియముతో నాకృతిన్ స్వీకరించినట్టి
విమల విఖ్యాతుడైన మీపెద్దకొడుకు
నాకు కవనంపుటల్లురు నాకు నింత
కంటె నేమికావలె మహాకవికి నాకు.

చెదలన్‌బట్టిన పుస్తకాలను మనీషీ!యచ్చువేయించి యా
పదలోనున్న మహాకవీంద్రుల కుటుంబాలన్ దయాభావనా
హృదయానన్ సమయాన కాదుకొను మీయిద్దోరు సంస్కారసం
దకున్ దోసెడు వందనాలగుత! సర్వారాయ! కమ్మప్రభూ!

విద్వచ్ఛ్రీసముపేతమై వినయ సంవిద్యాప్రబోద్ధామ సం
పద్విఖ్యాతమునై విశాల సమతాభావమ్మమై దివ్యమై
అద్వైతమ్మయి సజ్జనాళి కిరవై యంభోధి గంభీరదీ
వ్యద్వంశమ్మున బుట్టు మీయశము సర్వారాయ! సామాన్యమే.

పరిపూర్ణ ప్రతిభాధురంధరులు సర్వారాయ! జిల్లాప్రజా
పరిషత్తున్ నిశితంపు ధీబలముతో పాలించి సత్యానకే
కరమందించిన బుచ్చికృష్ణులు సదా గాంధేయవాదుల్ సదా
చరణుల్ మానవతాస్వభావులు, యశస్సాంద్రుల్ భవన్నందనుల్,

17-7-92

# బాష్పసందేశము

బలవంతమున నాడపడుచులన్ మ్రింగు క
న్యాశుల్క దావాగ్ను లారుదాక
మెతుకుకే గతిలేక సతమత మౌవారు
దారిద్ర్యరేఖను దాటుదాక
కులములులేని క్రొంగ్రొత్త చందమ్ములో
సంఘనిర్మాణమ్ము సాగుదాక
వెట్టితలలుదాల్చు బీభత్సకారుల
యుగ్రవాదపుచర్య లుడుగుదాక

కూడుగుడ్డగూడు కొఱకు తిప్పలువడ్డ
యార్త జనుల యెదల హర్ష కాంతి
పరిఢవిల్లుదాక బాష్పసందేశమ్ము
భువనతలము మారుమ్రోగుగాక.

ఏశనిగాడు వర్ణముల కృత్రిమసృష్టికి హేతువౌచు నీ
దేశనికృష్టపుం స్థితికి దిక్కయి భేదములుద్ధరించెనో
ఆశనిగాని శాసనములన్నియు గూలెడుదాక బాష్పసం
దేశము దిగ్దిగంతముల నిండునుగాక ప్రతిధ్వనించుచున్.

ఈనాభూముల నాక్రమించుకొని నన్నే తన్ను నాజాతికిన్.
కానిదైనదొసంగ కప్పనముగా కాజేసి హింసించి గ్రా
మానన్నేని వసింపరాదనుచు దుర్మార్గమ్ముతో పల్కు వా
రీనాడున్ గలరట్టి వారలకు నా యీ బాష్పసందేశముల్.

దేశద్రోహులు సాగుచున్న ప్రగతిఙ్ ద్వేషింతు్ర జాతీయతా
పాశస్త్యమ్మును వెక్కిరింతు్ర సమతన్ బంధించి యేకత్వమున్
కాశీగంగకు నర్పణంబిడుదు రీగర్వాంధచిత్తాల కా
శాశంపా నవదీపరాశియగు నిచ్చల్ నాదు సందేశముల్.

హింసావాదము బూడ్చిపెట్టవలె మత్తేక్కించు భేదాలు ప్ర
ధ్వంసంబై తలయెత్తరాదు ఋషులుద్భాసిల్లు భూమిన్ మహో
త్తంసంబై కళలేలగావలయు లేదా? జాతి నిర్వీర్యమౌ
శంసాయోగ్యత పొందు గాతమని యాశాసింతు నశ్రాంతమున్.

అనదల్ గుండెల నెత్తుర్పీల్చిన మనుష్యవ్యాఘ్రముల్ వాసముం
డిన దేశానకు సంస్కృతిప్రగతి రానేరాదు యజ్ఞాలు బూ
నిన మాత్రమ్మున శాంతిసౌఖ్యములు రానేరావు దౌర్భాగ్యభూ
మిని చైతన్యమొనర్చు చే తలపుసుమ్మీ! నాకు వాక్రువ్వగఙ్.

గద్దెనెక్కువరకు కడు వినమ్రతతోడ
తలను దించువారు గెలుపుపిదప
పలుకు వినరు వారిపట్ల నా బాష్పసం
దేశముండు గద్దెదిగినవరకు.

అతిసామాన్యు లరుంధతీతనయు లా యంబేద్కరీయుల్ ప్రజా
పతులై నిల్చిరొకానొకప్పు డిది పాపమ్మై తయారయ్యె నే
డతిహీనమ్ముగ నూచకోతలకు పాలౌటన్ క్షమార్హమ్మె? స్వ
చ్ఛత గాంక్షించినవాని దృష్టికగు సాశాబాష్ప సందేశముల్.

నవసమాజస్థాపనము ద్రొక్కి తనదు కు
లమ్ము వారలకు స్థానమ్మొసంగి
అమితాశతోడ సౌఖ్యమ్మంద గలగన్న
యాడపడుచుల నెల్ల నేడిపించి
భగవాను పేరిటవచ్చు రాబడినంత
తన స్వంతఖర్చులకనితలంచి
ప్రతిభకల్గినవాని ప్రతిభ వీక్షింపక
భజనగాండ్రకు మహాపదవు లిచ్చి

అతి నికృష్టమౌ మహాదురహంకార
పాలసులకు దుష్టభావుకులకు
పాశములను నాదు బాష్పసందేశమ్ము
లోర్పుమీర గూర్మినేర్పుగాక.

ఆశలుమోసులెత్త నవయమ్ము దరిద్రత తాండవింప నే
లేశమునైన సాయమదిలేక విశిష్టకృషిన్ ఘొనర్చువి
ద్యాశయమూర్తి జీవనవిధానము దుర్భరమైనవేళ సం
దేశము నూతనోత్సహాన దీపము జూపుతగాత మెప్పుడున్.

# ఆదరణము

గహనసీమలయందు గడుపార నేలియా,
బోనమ్ముచే దృష్టి పొందునాడు
మఱికొన్నియేడు లీధరమీద బ్రదుకంగ
'హిజ్కియా' కోరి ప్రార్థించునాడు
హర్యక్షసముఖమ్మునందు నిబ్బరపుగుం
డెను 'దానియేలుండు' నిలుచునాడు
పూర్తిగా బసిడిసొమ్ములు సంతతియు బోవ
'యోబు' యోపిక నిలుచున్ననాడు

అఖిలక్రైస్తవజన గృహప్రాంగణమున
మరియ ముద్దులకొమరుండు తిరుగునాడు
వేదవాక్యమ్ము నీదు హృద్వీథి మెఱయ
నేమితిందుమో యని విచారింపనేల?

ఆతండ్రి మనకాశ్రయంబంచు 'దావీదు'
కువలయాధిపుడు వాకొన్ననాడు
వైశద్యమిడు 'యెహోవా'ను నమ్మినవని
'సొలొమోను' రారాజు పలుకునాడు

## ఆ హ్వా న ము

అల్పవిశ్వాసులారా! మీకు భయమేల
            టంచు నేసుడు నిర్వచించునాడు
బుద్ధివిజ్ఞానసంభూతి దేవునిదంచు
            కొలసైయులకు 'పౌలు' తెలుపునాడు

ఏలనీవు విషాదబాష్ప లురాల్చి
కుమిలి కూలారుటలు నమ్ముకొన్న నిన్ను
ఆమహాజగద్రక్షకుండవని గాచు
నేమి తిందుమో యని విచారింపనేల?

1-4-1966



## ఆశీస్సు

వెలిగింపవలయు శోషిలువాని యెడద నా
　　నందచైతన్యరత్నాల దివ్వె
నిలిపింపవలయు దిక్కులలోన ఘనసమా
　　ధాన సచ్ఛాంతి వాతావరణము
పలికింపవలయు ప్రజలు మెచ్చుకొన్నవి
　　స్ఫార ప్రణాళికా ప్రగతిగీతి
చిలికింపవలయు నుజ్జ్వలముగా విశ్వ శ్రీ
　　రస్సీమ నైక్యమారందధార

కలుషితమ్ములయిన యలసుల రాజకీ
యాలకుటిలకూహకాల దరిమి
ప్రబలుమింక నీకు స్వస్తి కోస్తావాణి!
వెలుగు లెగయజిమ్ము తెలుగువాణి!

1-3-1983



# సవాలు

ఎవడవు నీవు? నీయునికి యేమిటి? నీవొనరించు చేతలం
దవుర! విశేష మేమిగల దయ్యదిలోక మెఱుంగుచో నిన్నుఁ
మివులను గారవించి నిను నెత్తినబెట్టుకపోదుగాని నీ
వు వెకిలివేషముల్ సలుపు పోకడలంగని దూఱకుండునే?

నీ వేదోయనుకొంచు గర్వమున నంధీభూతచేతస్కుఁతన్
ధీవైశద్యము గల్గువారలను నిందింపన్ ఫలంబేమి? నీ
లో వీసమ్మయినమ్మ చోటుచేసికొన దీలోపమ్ము గుర్తించి దు
ర్భావమ్మున్ విడనాడి సత్ప్రతిభకున్ పట్టమ్ము గట్టింపుమీ!

నీవానిన్ ప్రతిభావిహీనుడగు వానిన్దెచ్చి సాహిత్యవి
ద్యావిశ్వాన కిరీటముం దొడిగి గర్వాంధుండవై పొంగి యే
వేవోపల్కులు పల్కుచుండుటలు నీకేచెల్లె నీలాటివా
డీ విద్యాశిఖరాన నిల్వదగదోయీ! కాలమే తీర్చెడిన్.

నీచుట్టున్ పదిమందిచేరి నిను వందింపన్ మహానందకే
ళీచిత్తమ్మున పొంగిపోదువు భళారే! సాహితీసత్కళా
క్ష్మాచక్రార్చన లందికొన్న కవితామాన్యున్ ఋజుస్వాంతునిన్
వాచాటా! నిరసింపచూపెదవె నీపాండిత్య శౌండీర్యమున్.

హితమున్ మానవజాతికిన్ దెలుపగా నెప్డున్ సమున్మేష స
త్ప్రతిభాధేనువు పిండి సత్కవనదుగ్ధశ్రీ ప్రసాదించి యు
న్నత మార్గమ్మున బోవు ధీనిధిపయిన్ వ్యాఖ్యానముంజేసి నీ
బ్రతుకున్ బైటకు పెట్టుకొందువె? దూరాలాపా! యసత్యప్రపా!

నా రచనావిధాన కవనాన నిధానమనోజ్ఞబంధుర
శ్రీరమణీయ శబ్దరుచిరేఖ, సమగ్రపరిస్ఫుటధ్వని
ప్రేరణకారణమ్ము రసవిస్ఫురితైకమరంద బిందు సం
భారము దీప్తిమై వెలయువాణి ననున్ వరియించి వచ్చెడిన్.

క్ష్మారంజిల్లగ నస్మదీయ కవితా గంగామహానిర్ఝరీ
ధారాధోరణి సాగు, దీనజనబాధాగాథలం దెల్పియ
వ్వారల్ నిత్యము సౌఖ్య జీవనము సల్పంబూనగా జేయుచే
ఆరాధ్యంబగు నాకు నాకవితకున్ వ్యాఖ్యాన మింకేటికిన్.

నా శైలీవిన్యాసము
పేశలసుమసమము మధురపీయూషము ధా
రాశుద్ధినిబద్ధము నా
వేశనిభృతము మునుపటి కవీశుల విధముల్.

అంజాయించెదొ యడ్డగించెదవొ యౌరా! సైంహికేయా! చెడున్
భంజింపించెడునట్టి నాదుకవితల్ వజ్రాయుధమ్మై జగా
పంజాదెబ్బయి సంఘసంస్కృతికి వైప్లవ్యమ్ము గల్పించు నీ
జంజాటమ్ములు మాని నేడయిన పశ్చాత్తాపముం బొందుమీ.

ఆ హ్వా న ము

మార్గమందు జనెడు మత్తద్విపమ్మును
గనుచు తెలివిలేమి శునక మఱచు
నంతెగాని యేన్గు హాయిగాబయనించు
నిక్కువముగ నీది కుక్కబుద్ధి.

9-9-1983



# సంక్రాంతిలక్ష్మి

ఈ సంక్రాంతులు నీకు పూర్వమిటులే యెన్నెన్నొ వచ్చెన్ మఱె
న్నోసంక్రాంతులు వచ్చునిట్టుల నదేమోకాని సౌభాగ్యరే
ఖాసంక్రాంతు లొసంగజాలినవె యీకష్టాలగాథావ్యథా
ప్రాశిన్ జాతిని ముంచిపోయినవి సంక్రాంతీ! విచారింపగన్.

చివురించునా కష్టజీవి యాకాంక్షించు
ఆశాభ్యుదయపు లతాంకురమ్ము
సవరించునా మతజాత్యహంకారము
నధ్యాత్మఘనచింత నాధ్యయనము
వివరించునా మానవీయవాదమ్మును
నఖిలపురాణ శాస్త్రాగమములు
ప్రవహించునా శాంతివాహినీ ధారాప్ర
వాహమ్ము దగ్ధాంధ్రవసుధయందు

ఉడుగునా తెలుంగు లోకనిపై నొక్కడు
గిల్లుకొనుట బురద జల్లుకొనుట
తెలుగుమట్టిలోనగల విచిత్రంబిద్ది
యేమొ? సంకురాతిరీ! తలంప.

పాడియతప్పి నాయకులు పాడుపనుల్ పచరింప ధర్మపున్
జాడల ధిక్కరింప కడుస్వార్థపరత్వము వారిగుండెలో
గూడునుకట్ట శాంతిసమకూడుట యెట్లు విషాదగీతికల్
పాడుటయే శరణ్య మిది వాస్తవమేకద! సంకురాతిరీ!

సుతరామ్ మచ్చుకు కానిపింపవిట యాసొంపుల్ పిసాళించుసం
స్కృతి సంక్రాంతికి. సంబరాలిపుడు లేనేలేవు హింసామహో
ద్ధృతరూపాన ప్రచండుడై మరణమారీచుండు దౌర్జన్యప
ద్ధతిలో సల్పుచున్నవాడు నరమేధంబున్ విలోకింపగన్.

ఇది మామూలుగవచ్చు రాకడలె కానీ నేడు నీరాక దు
ర్మద మాత్సర్యమతాలవర్ణములతో మత్తెక్కుసంఘాన కే
మది సందేశము నియ్యనెంచితివొ! లేదా యిట్లె పైశాచికా
రథమున్ లాగినశింపజేసెదవొ సంక్రాంతీ! భయంబయ్యెడిన్.

స్థిరసంకల్పబలమ్ముకల్గిన జనశ్రేయోభిలాషుల్ యుగం
ధరునిన్మించిన యీతెలుంగులు రసానందుల్ కరంచందు వా
క్సరణిన్ పోయెడివారె వీరలకు నైక్యంబింత శూన్యంబు సో
దరతాగంధము నాస్తి నీవెటుల మద్దత్తిచ్చి సాగింతువో.

రక్తప్లావితమైన మా నగర మార్తధ్వానముల్ విన్న దు
శ్శక్తుల్ నెత్తురుద్రావు రాక్షసుల దౌర్జన్యాలు హింసల్ మహో
ద్రిక్తంబై చెలరేగ మానవత గోరీచొచ్చె నీవేళ నే
శక్తిన్ జూపి ప్రశాంతినింపెదవహో! సంక్రాంతి యీనేలకున్.

ఈ వెలుగారిన యీదేహ మెవరిదో
పాలుద్రావిన పసివానిదౌనొ?
ఈ శిథిలంబైన యీతను వెవరిదో
బక్కచిక్కిన ముదివగ్గుదౌనొ?
ఈ నెత్తుటిమరక లవెవరివోకద! మహా
బలదర్పశాలి యౌవనునిదౌనొ?
ఈ ఖండితంబైన యీమొండె మెవరిదో
చెప్ప నమాయకజీవిదౌనొ?

ఇవియ నిన్ను నాహ్వానింప నెదురువచ్చు
శకునసందర్భములు తెల్గుజాతి బ్రతికె
వైభవమ్మున తొలి, నాటిప్రాభవమ్ము
కలుగవలె నేడు నీరాకవలన మరల.

ఈగంగెద్దుల సంతసాలిపుడు లేనేలేవు జంగాల శం
ఖాగీతాల పరిస్ఫుటధ్వనులు మృగ్యంబయ్యె వాచింప నే
డీగూండా లొనరించు హింసలకు నంతేలేదు దుర్దాంతబా
ధాగాథాతిమిరమ్ములో మసలు నాంధ్రక్షోణి గాపాడుమీ!

నాదెపో నుడవ సనాతనంబైనట్టి
సాకేతకుని రామజన్మభూమి
మాదెపో యన స్వర్గమార్గమ్ము బోధించు
పేర్మికిన్ పాదు బాబ్రీమసీదు

అవునుపో నాది ప్రేమామృతంబును పంచు
నన ఘుడౌ క్రీస్తు దేవాలయమ్ము
నిజముపో మాది శాంతిని లోకమునజాటు
ప్రేమస్వరూపి యారామభూమి

అన్ని దేవాలయాల్ మాపె యగును భిన్న
భిన్న వాతావారణము లవెన్ని యున్న
అందరమ్మొక్కటే యను నావిశాల
భావములునిల్పు సంక్రాంతిపౌష్యలక్ష్మి.

ఒకజాతీయతక్రింద సర్వజను లత్యుత్సాహముంబొంది సాం
ఘికమైత్రీవిభవాలు పెంచుకొనుచున్ కీర్తిధ్వజంబెత్తి రీ
కకుబంతమ్ములుదాక వీరికిపు డీకష్టాలు వాటిల్లె నీ
వికదౌర్జన్యము మట్టుపెట్టుటయె మాకీవేళ సన్మానముల్.

మతవిద్వేషములున్ కులాలగొడవల్ మాయన్ మహౌజ్జ్వల్యవం
దిత సమ్యక్సమతాప్రసూనములు నీదేశాన పూయన్ జగ
ద్ధితమై సత్కవులెల్ల మేల్రచన లుత్తేజాన వ్రాయన్ పురో
గతిగల్పింపుము శాంతిపద్ధతుల సంక్రాంతీ! మనోజ్ఞాకృతీ!

కలహాలన్ సృజియించు ధూర్తులగు సంఘద్రోహు లున్నారు వా
రల గంటన్ గనిపెట్టి సాగునెడ స్వర్గం బిందు తారాడుచున్
నిలుచున్ దుష్టుల యాటలింక నిలువన్ లేవప్డు నీవల్ల తె
ల్గులకున్ కల్గును వెల్గు పైనమగు నిగ్గుంజగ్గు సౌభాగ్యముల్.

నగుబాటౌగద! సిగ్గునున్విడిచి కంఠంబెత్తి శోషింతు రీ
తగవుల్ హత్యలు మానభంగముల ప్రస్తావించి కల్లోలపున్
పొగలన్ పెట్టుచు స్వార్థలోలురు నిజంబు న్నీవు గుర్తించి దుం
డగులన్ ద్రోహుల మేకవన్నె పులులన్ దండింప నర్థించెదన్

క్షితిసౌఖ్యమాశించి చెమటోడ్చు శ్రమజీవి
గుండెలో హర్షమ్ము నిండునాడు
అణగారిపోయిన జనులపై ధ్వజమెత్తు
కలవాని జులు మరికట్టునాడు
పడతిశుల్కముగోరి బలవంతమున జంపు
వంచకాధముని శిక్షించునాడు
కసిబూని జనులలో కల్లోలములు రేపు
దుష్టశక్తుల దుమ్ము దులుపునాడు

నగవు లానాడు పెదవుల నాట్యమాడు
మాకుసంక్రాంతియగునుపో మాకు నాడు
ఈనిరాశాఘడియలందు నీవె తెలుగు
జాతికొసగుము సంక్రాంతిసంబరాలు

9-9-1983



# దివ్యస్మరణ

నిదురంబోయిన జాతిమేల్కొనియె గుండెల్ దట్టు నీవాక్కులో
నుదయించెన్ నవతావికాసములు నెహ్రూనందనా! నీమహా
భ్యుదయోహల్వలనన్ సమగ్రపథకంబుల్ పండెదేశానకున్
బ్రదుకర్పించిన నీమహామహిత నిస్వార్థంబు శంసార్హముల్

భువనమ్మెల్ కొనియాడ భారతము పెంపుంగోరి దీక్షామహా
సవనంబున్ బొనరించి పేదలకు నాశాజ్యోత్స్నపై వెల్గి భూ
ధవు లాంగ్లేయుల పెన్దురాగతములన్ దప్పించుఖండించు నీ
కెవరమ్మా! సరిజోడు వేరొకరు నీపృథ్వీమహాభాగమున్.

ఎత్తించినావు దిగ్భిత్తులు కొండాడ
స్వచ్ఛభారత ప్రతిష్ఠాధ్వజమ్ము
ఖండించినావు మూర్ఖభ్రష్టదుష్ట శా
త్రవుని మహోగ్రకరాళదంష్ట్రి
నిండించినావు పండెముపైచి "నిక్సను"
కుటిలపై విధ్యంపు గుట్టునెఱిగి
చెండించినావు ప్రోద్దండులౌ మండూక
భక్షణుల్ సాగించు వాదపటిమ

సామ్యవాద సిద్ధాంతశాస్త్రమును జదివి
దీనదశలోన మ్రగ్గెడు దేశములను
పిలిచి భిక్షమ్ముపెట్టిన యలఘురాల!
భారతక్షితి పుణ్యాలపంట వీవు

నీతరహా! యదొక్క కమనీయవిధానము నీతలంపులో
జాతిపురోభివృద్ధికి పసందుప్రణాళికలుద్భవిల్లె ధా
త్రీతలమెల్ల పొంగినదిలే, తిలకించెనులే; త్వదీయపున్
చేతల కబ్రమ ందిది, విశేషము "భారతరత్న" దీపమా!

బ్యాంకు ప్రాంగణాన పదముపెట్టనివాడు
పదముపెట్టె బ్యాంకుప్రాంగణాన
చదువులేని యద్రిజనుడు నీకృషివల్ల
ఉన్నతముగ చదువుచున్నవాడు

ధీమాచాతురితో జపించితివిగాదే యీ గరీబీహటా
వో మంత్రమ్ము దరిద్రమానవులకె ప్డున్ మేలుగల్పింప త
ల్లీ! మాభావములందుకో గలవె? నీయీ దివ్యసిద్ధాంతసు
శ్రీ మాహాత్మ్యముమ్రోల నీవలనచేరెన్ మాకు చైతన్యముల్

ఈ బంగళాదేశ మెవరు స్థాపించిరి
అసహాయశూరు రాలైన మగువ
ఈ అభ్యుదయమున కెవరు కారకులన్న
పిటికింతలేని జహ్వారునితనయ

ఆ హ్వా న ము

ఈ బడుగుజనాళి కేవ్వరాశాదీప
మిండియా భాగ్యేందిరేందిరమ్మ
ఈ ప్రజాస్వామ్యమ్మె నెవ రుద్ధరించిరి
ఘనుడు మోతీలాలు మనుమరాలు

ఉక్కుబోలు తలపు మొక్కలోవని శక్తి
సడలనట్టి ధైర్యసాహసాలు
కలిగె నెవరికిచట తలపగా నీవెగా
అపరశాంభవీ! జోహారు లివియె.

నీలక్ష్యమ్మె స్వతంత్రభారతజనానీకమ్మె సంతోష సౌ
ఖ్యాలం దేలుట నీమహోద్ధృత ప్రతిజ్ఞాదీక్ష యీవిశ్వ భూ
గోళంబందున మాతృభూమికి వెసన్ గొప్పందనం బబ్బుటల్
నీలోగూర్మిలు గూడుకట్టుకొని నిండింపించె ధర్మార్థముల్.

నెత్తురుద్రావు పొగ్బలము నీ జననీ భువనమ్ముపైకి దం
డెత్తుట వీరభారతమునే కదలించుట సంగరమ్ములో
చిత్తయినారు శాత్రవులు చెల్లెను నీప్రతినల్ జగద్దిశా
భిత్తితలాన నీపసిడిపేరు లిఖింపబడేన్ దలంపగన్.

ఇంకిపోని నీదు సంకల్పభావాలు
తొందరగనె సిద్ధినొందుగాక!
జంకులేని నీదు సాహస కృత్యాలు
జగతి కేపుడు మార్గమగును గాక!

భువనమ్ముల్ ప్రణుతింప వన్నెనరణవ్యూహాలు స్వర్ణాక్షర
చ్ఛవులన్ జిమ్మెను నీమనోదర్శిమ మాశాకాంతులై యిండియా
భువి కౌన్నత్యపథమ్ము చూపెడిని, నిప్పుల్‌గ్రక్కు నీగాథలున్
అవతారమ్మును దేశజాతికి భవిష్యజ్జీవనాధారముల్.

1-3-1983



# అక్షరకళాజ్యోతి

సరసత్వమ్ము సదాశయమ్ము విలసత్ శాంతిక్షమాసద్గుణో
త్కరభావమ్మును పెంచి సర్వజనసౌగంధ్యమ్మునుంబెంచి సో
దరతాగంధము నింపి మానవునిగా ధాత్రిన్ నిలంబెట్టి యీ
పిరిగానిల్చిన యక్షరాస్యతకు నుద్వేల ప్రశంసాంజలుల్.

చదువుదివ్వటీలు జ్వలియించుచోటుల
విజ్ఞతావివేకవిలసనములు
చమురుకొనును నాడు సమయు నజ్ఞానంపు
తిమిరపటలి తొలగు భ్రమలసరళి.

అక్షరాల్ నేర్చిన అబ్రహామ్ లింకను
డమెరికాభూమి కధ్యక్షుడయ్యె
కష్టించిచదివి 'బుకర్ టివాషింగ్టను'
ప్రజ్ఞాధురీణుడై పరిఢవిల్లె
ఎనలేని కృషిసల్పి ఘనతగాంచిన డాక్ట
రంబేద్కరు జగాన యశముపొందె
అవసరంబనుచు కాలువదాటి చదివిన
లాల్ బహదూర్ లోకప్రణుతు లందె

అక్షరాస్యతమూలాన అవనిలోన
విజ్ఞతావిజ్ఞతాబుద్ధి విశదమగును
అక్షరజ్ఞానమేలేని యట్టినరుడు
తనకుతానె శాత్రవునిగా తలచుకొనును.

నగుబాటున్ తొలగించి మానసికవిజ్ఞానమ్ము పెంపొందగా
ప్రగతిన్‌చూపి యమందహర్షముహృదబ్జంబందు పూయించి తా
సుగమంబున్ పొనరించు నక్షరకళాశోభాయమానమ్మె నిం
పుగ దేశానకు రక్షగానిలుచునీవ్యూహాలు శ్లాఘ్యాంశముల్.

ఎక్కడయే ప్రదేశముననెందున నందున నక్షరాలకున్
మక్కువచూపగాగలుగు మానవులుందురొ యక్కడే ప్రజా
వాక్కులకర్థమై వసుధవర్ధిలు విద్యగలట్టి దేశమే
దిక్కులలోన గౌరవపుదీప్తుల గాంచును వ్రాలుసంస్కృతుల్

చదువన్ వ్రాయనువచ్చువారలకు దేశంబందు నుత్పన్నమౌ
బదవుల్ సాంఘిక రాజకీయముల సంబంధాల్ ప్రజాజీవనా
స్పదమైనట్టి ప్రణాళికాభ్యుదయముల్ వార్తావిశేషాలు స
మ్ముదమేపారగ్రహింతుర్ దేశమపు డుప్పొంగున్ సగర్వంబుగన్.

తనపనియేమిటో యనుచు దిక్కులుసూడక తాముతామె తా
పనియదియేమిటో తెలిసి ప్రజ్ఞకొలంది శ్రమించి దేశభ
క్తిని వెలయింతురీచదువు తీరులుతెన్నులు నబ్బినంతకా
వున నిపుడక్షరాస్యతకు మూలమునౌ పథకాలుకావలెన్.

ఆ హ్వా న ము

వెలిగింపవలయు నుజ్జ్వలపు విద్యాదీప్తి
బడుగువారల పూరిగుడిసెలందు
విలిపింపవలయు నెండిన బక్కటెముకలు
గలవాని నాల్కపై కాస్త విద్య
సాగింపవలయు నక్షరకళారథయాత్ర
అంటరానిగృహాల యంచుదాక
ప్రవహింపపలయు నిరాఘాటముగ నక్ష
రజ్యోతి గ్రామీణప్రాంతములకు

చదువుసంధ్యలేక జరుగునేటి ప్రపంచ
చరితనెఱుగలేక చప్పపడిన
జనగణాల హృదుల చైతన్యభావాల
నిలయమక్కరాలు మొలువవలయు

ఎపుడీయక్షర సత్కళారథము హాయిగ దేశమందంతటన్
అపరూపమ్ముగ సంచరించి ఘనవిద్యాతత్త్వమున్ దెల్పునో
అపుడే భారతజాతికిన్ గలుగు ప్రోద్యత్ గౌరవాధిక్యతల్
విపులం బైనటువంటి యక్షరకళాపీయూషభాండారముల్

క్షరముగానట్టిదైన యక్షరము విశ్వ
భారతవసుంధరకు దివ్యభాగ్యరేఖ
అక్షరకళామహోద్యమ దీక్షకొఱకు
ఈదినాన వ్రాసితిమీకు నాదులేఖ.

16-4-1992

# గాడిచెర్ల

తెలుగువారల గేహాల వెలిగినట్టి
నవనవోన్మేషచైతన్య నవ్యభావ
దీపికాగ్రంథనిలయాల తేజమునకు
కారణము చెప్పగా నీవు గాడిచెర్ల.

నా తెలుగుల్ విశాలభువనాన వివేకవికాసవిజ్ఞతా
నేతలుగా రహింపవలె నేటి దరిద్రసమాజదౌష్ట్యపున్
చేతలు మాన్పగావలయు జీవితమంతయు నందుకోసమై
ప్రీతిమెయిన్ వ్యయింతునని పేర్మినిబల్కిన నీకు నంజలుల్.

శ్రమలెన్నో నిను జుట్టు కొన్నను సరే సాధించి గ్రంథాలయో
ద్యమదీక్షాసవనమ్ము సల్పిన సముద్యద్దివ్యభావాత్మ! యు
త్తమజాతీయ సమైక్యసౌరభము లాంధ్రానన్ గుబాళింప మా
ర్గముజూపించిన త్యాగమూర్తివి నమస్కారమ్ము సర్వోత్తమా!

బిట్టదరన్ బ్రిటీషుపృథివీపతు లెల్లరు ముక్కుమీద వ్రేల్
పెట్టుకొనంగ నీవొసగు బెట్టుజవాబు తెలుంగుజాతినిన్
తట్టుచు మేలుకొల్పినది ధన్యుడవయ్య మహానుభావ! నీ
వెట్టిన మార్గమందున సుమించును జ్ఞానలతాంతగంధముల్.

ఆ హ్వా న ము

స్మరియింప న్నిను నీదు పేర నసిగా స్వాంతాలనెల్లప్డు సుం
దరసర్వోత్తమ గ్రంథగేహము మహాంధ్రక్షోణి శ్లాఘింప నో
హరిసర్వోత్తమరాయ యేమికావలెను స్వార్థాసక్తి లేనట్టి నీ
చరితల్ మిక్కిలిపూజనీయములు రక్షాబంధ మంత్రాక్షతల్.

నీదు శతజయంతి నిఖిలాంధ్రులకు మాత్ర
మనుట సరియగాదు నఖిలభువన
విజ్ఞతతికి జ్ఞానజిజ్ఞాసపరులకు
నుజ్జ్వలంపు వార్షికోత్సవమ్ము.

జనవంద్యా! తెలవారు నీపయిని రాజద్రోహ నేరమ్ము మో
పిన దౌష్ట్యానకు నీవొసంగిన జవాబేచాలు నీధైర్యమెం
తని వర్ణింతును తెల్గుగుండియల గ్రంథజ్యోతి వెల్గించుధీ
మణి! నూరేడుల నీజయంతి కివె సంభావ్యప్రశంసానతుల్.

బ్రతికినంతవఱకు గ్రంథాలయాధ్యక్ష
పదవి నిర్వహించి పరమతృప్తి
బడసినావు తెలుగువసుధ గ్రంథజ్ఞాన
సౌరభమ్ము గాడిచెర్లకులజ!

గాడిచర్లవంశ్య గ్రంథాలమోద్యమ
సారథీ తెలుంగుజగతి నీదు
శతజయంతి సఫలజరుపుట గ్రంథాల
యాలచరిత దీప్తి కాలయమ్ము.

8-9-1984

# ఆశాగానము

ఈ తెలుగమ్మనేల కృశియించినదోయి? ప్రజాపతీ! ప్రమో
దూతహిడింబి హస్తముల ధూర్తుల దోపిడిగాండ్ర చేతిలో
నీతియు గింజుకొన్నయది నెత్తురుపొర్లెను దొర్లె మొండెముల్
ఈ తరుణాన వచ్చితివి యెట్టిశుభాల ననుగ్రహింతువో.

# తెలుగుతల్లి

కలిగెన్ నేటికి పొట్టివంజుని రక్తత్యాగపుణ్యాన నీ
తెలుగున్నేలకు వేయివర్షముల యుత్తేజమ్ము లొక్కమ్మడిన్
వెలసెన్ తెల్గులవెల్గు లీయఖిల పృథ్వీమండలిన్ తెల్గువా
రలకున్ దిక్కులు దోయిలించినవి యాంధ్రక్షోణి! నీభాగ్యమా.

సరిగానేలిన నేలనీయని మనుష్యబ్రహ్మలున్నారు వీ
రిరుపక్షమ్ముల పందెముడ్డెదరు కానీ! న్యాయమిద్దంచు చె
ప్పరుతల్లీ! యిది నీకుమారకుల దౌర్భాగ్యమ్మె నడ్పింపు సుం
దరతాసుస్థిరతా మనోజ్ఞకలనానందప్రధాధ్వమ్ములో.

అరులన్ గెల్చుటలోన దిట్టలు రణవ్యాపారతంత్రీన పో
టరు లావేశమునందు గొప్పదగు పట్టా పుచ్చుకొన్నట్టి ధీ
వరులైనప్పటికిన్ సమైక్యసమతాభావాలు లేవమ్మ! యె
వ్వరు రక్షింతురు తెల్గుసంతతిని విశ్వామిత్రసంబంధులన్.

## ఆహ్వానము

తీర్చునే? ఘనసాంస్కృతిక వినోదములెల్ల
కడలేని నిఱు పేద కడుపుమంట
ఆలించి పాలించునా? నాయకేంద్రుండు
కడగొట్టు కవిగాని బడుగుకోర్కె
పోగొట్టగలడె? గాంధీగారి శిష్యుండు
పంచమీయులకెల్ల ప్రాణభయము
రాజ్యాంగశాసనరచన నిజమ్ముగా
నొసగునే? పేద కుద్యోగవసతి

ఎందుకే తల్లి! చెల్లని యిచ్చకాల
మాటలాడుచు జనులను మభ్యపఱచు
నీదగాకోరు నాయకులెల్ల నీప్ర
జాపతి! యుగాదినైన మార్చవలెసుమ్మ!

ప్రతిభ లేనియట్టివానికి కులమున్న
త్రొక్కి యందలాల నెక్కగలడు
కులలేనివాని విలువైన ప్రతిభకు
జాగలేదు తల్లి! క్ష్మాతలాన.

కుటిలఘోరమహోగ్రకుల మతోన్మాదంపు
సంఘర్షణమ్ములు సమయునాడు
ఇజముల గోలలో నిజమైన యధికారి
పైరవీలకు మోజు పడనినాడు

హితముగూర్పగలేని ప్రతిబంధకములైన
చట్టమ్ములను పాతిపెట్టునాడు
గుండెదివ్వెలు జాతినింపుతనముగూర్చు
కళల కాస్కారమ్ము గలుగునాడు

నాడు కదటే యుగాది యేనాడు జరుగు
నేను పలికినపలుకు లవెల్లనాడు
హృదిని నీప్రజాపతిరాక కెదురుకోలు
వేడ్క పలికెద కాదేని వీడుకోలు.



# ౨-ఎంప్లాయ్‌మెంటు

అతడు సౌజన్యమూర్తి దేశాభ్యుదయమె
సతము నాశించి జీవనసాగరాన
నీతగొట్టుచు బ్రతుకు పునీతచరిత్రు
డతడు ఘనకవితా ప్రపంచాధినేత.

అతడు నిఱుపేదగా పుట్టినందు కతన
నార్షధర్మమ్ము వెలివేసినందు కతన
నంగబల మర్థబలము లేనందు కతన
నతని బ్రతుకులో జీకటు లావరించె.

అత డాత్మాభిమాని యంచవని యెఱుగు
నాత డుద్దండసుకవి యంచవని యెఱుగు
నాతని దురదృష్ట మిదేమొ యంతవరకు
నెఱుగువారలె దూరాన కరగినారు.

పూర్వనృపులు కళలబోషించి వారని
పుస్తకాలలోన పొందుపరచి
నార లవి చదివినను సత్కవులపట్ల
ప్రేమలేని వారి విధముజూచి,

కళ్ళనెవండు కంటగనిపెట్టి తత్కళా
మూర్తి కీజగాన ముద్దవెట్టు
రసవిహీనులున్న రాజ్యమ్ములో చిన్న
పదవియైన మేలు బ్రతుకుకొఱకు.

తనమనస్సు లోన తర్జనభర్జన
సలుపుకొనుచు సుకవి యలతిపదవి
కొఱకు నెన్నొపాట్లు పరిసమాప్తముజేసి
స్వాగతించె నయ్యవారిపనికి.

ఘనుడు గురువు తనదు కన్నబిడ్డలవోలె
శిష్యతతికి బోధచేసి భావి
తరము ప్రోన్నతంపుదారిలో నడిపింప
ముప్పదేండ్లు దీక్షబూనె నంత.

తాను సుకవియౌట దైవమారోగ్యమ్ము
నిడుట రచన లచ్చుపడుట కలసి
వచ్చెనేబదైదువర్షాలు దాటినన్
ప్రభుత వానికయిదువత్సరాలు.

పదవిమరలనిచ్చి పండితపదవిని
నిలిపెగాని పదవివలన వాని
కెట్టిమేలు జరుప రెంతకు విజ్ఞప్తి
చేసినను సలాము చేసికొన్న.

## ఆ హ్వా న ము

ఒజ్జలెల్లరకును నొనర జీతముపెంచె
ప్రభుతగాని వీనిపట్ల యెట్టి
పెంపులేదు మాటవినిపించుకొన్నట్టి
వాడులేడు ప్రభుతవర్గమందు.

లెక్కలేనిసారు లక్కటికమ్ములే
నట్టి దొరలకీత డాతురతను
దైవమును తలంచి దాఖలుచేసెనో
తెలియగలదు చర్యతీసికొన్న.

పేదవాడు సుకవి ప్రియబాంధవుడు దేశ
మానవులకు దీపమైనవాడు
చేసెపోస్టులో రిజిష్టర్డుకవరుల
కడకు చాలధనము ఖర్చుపెట్టి.

కనినవాడు లేడు వినినట్టివాడును
లేడు చేరినట్టిలేఖ కెవడు
బదులు వ్రాయగలడు బదులువ్రాసినవాడె
యేమివ్రాయునో మహేశు డెఱుగు.

వంకిసూపి రూల్సు పంకంబునుం జూపి
చంక లెగురవైచి జంకులేక
నేడ్పుధ్వనులతో 'రి యెంప్లాయిమెంటు' లో
బ్రతుకుజీవునకు జవాబువచ్చు.

చూడ నట్టివారిజూచిన కలుగలే
దింతయైన మంచి యింతవఱకు
తీర్చిదిద్దగలడు దేవుడే యున్నచో
తప్పకుండ బుద్ధిచెప్పి చెప్పి.

కులమతాలు స్వార్థములు గూడుకట్టు కొ
న్నట్టి మనుజజాతి యందు నెపుడు
పొటమరింప గలదొ పూర్ణ సౌగంధ్యమ్మ
బ్రతుకు నపుడు మానవత జగాన.

మీగుఱించి వింటి మీకవిత్వము గంటి
మిమ్ముగుఱిచి మాకు మీరుచెప్ప
వలయు నవసరమ్ము పడదింక మీపని
జరిగితీరు నింటి కరుగుడనిన.

ఇంటికేగుదేర వెంటనేవచ్చిన
యాత డప్పుడార్డ రందుకొనియె
నందు 'సారి' యన్న యర్థమ్ము గమనించి
నవ్వలేక యతడు నవ్వుకొనియె.

ఇంక్రిమెంటు లేని యీ వల్లమాలిన
యట్టి పదవినిచ్చి యంతులేని
దుఃఖవార్ధి ముంచి తోషించు ప్రభుతకు
నెట్టులుండగలవు పుట్టగతులు.

## ఆ హ్వా న ము

అప్పుచేసి చేసి యాకవిసార్వభౌ
ముండు చెప్పు లరిగిపోవునట్లు
తిరిగినాడు రూల్సు బిరిగిచుకొన్న యు
ద్యోగి వరులచుట్టు జోగివోలె.

దఫదఫాలు రాజధాని నుద్యోగుల
చుట్టుతిరిగి కడకు మట్టికరచి
న్యాయమునకు దూరమై నిరాశను మున్గి
నెమ్మనమున నిట్లు నిశ్చయించె.

ముఖ్యమంత్రి సముఖమున చెప్పికొన్న లా
భించునేమొ యని తలంచి తుదకు
ముఖ్యమంత్రిసముఖమున చెప్పుగొనె గాని
యదియగూడ వ్యర్థమయ్యె నటుల.

భువనవిజయమునకు మొదటిమెట్టయినట్టి
నిసుగు కడుపులోన నింపునమృత
మయిన యక్షరాల నంతటి గురునకు
ప్రేమనిడిన సత్కరింపులివ్వ.

ఎవరుచేసిరీ "రి యెంప్లాయిమెంటను
చట్టమును కడుపును గొట్టుటెగద!
'ఫెసిలిటీసు' తీసివేయుచో నికనేది
చదువులయ్యు కవని బ్రదుకుతెరువు.

### రి-ఎంప్లాయ్‌మెంటు

తెలుగుజాతిసంస్కృతులకు న్యాయముగూర్చి
నాల్గుదిశల కీర్తి వెల్గవలయు
నంచుపైకిచెప్పి యన్యాయమును జేయు
వారి జాతి కేది ప్రగతిపథము.

నియతితోడ నార్డినెన్సు జారీచేయు
ప్రభుత చూడదిట్టి పదవినందు
బ్రతుకువాని గోసకు వాడు ప్రార్థించినన్
బదులుచెప్ప దీగవర్నమెంటు.

వానిదరఖాస్తు చూడగావలయునన్న
చావవలయునువాడు ప్రజాప్రభుత్వ
మపుడు మకరాశ్రువులరాల్చి యతనికీర్తి
గానమొనరించు నిదియ దగాతనమ్ము.

కవితపట్ల మోజుకలిగిన ప్రతివాని
దరిసెనంబుచేసి తానుపడెడు
పనినిగూర్చి తెలుప వినరైరి చివరకు
నప్పుమిగిలె యతని కైదువేలు.

19-9-1983



# జన్మభూమిలో సన్మానము

విశ్వంభరాకర్త వేణుగోపాలుండు
స్థిరముగా నెచ్చోట తిష్ఠవేసె
మల్లమాంబాదేవి మహితపాతివ్రత్య
పరిమళ మ్మెచ్చోట తురగలించె
రంగరాయని వజ్రపుంగత్తి పరిపంథి
శీర్షాలనెచ్చోట చీల్చిచెండె
తాండ్రపాపయ మహాధైర్యలక్ష్మికి జగ
జ్జాలమెచ్చోట జేజేలువలికె

పేరుగాంచినట్టి వెలమకులీనుల
జన్మభూమి వీరశౌర్యభూమి
బొబ్బిలియది నేనుపుట్టిన సీమ నా
పుణ్యమునకు పొంగిపోదు నేను.

ఎగిరెన్ నింగిని శత్రుమస్తకము లెన్నెన్నో తు నాతున్కలై
పగిలెన్ బుస్సి కుతంత్రకూహక మహాభాండమ్ము లీయుద్ధపున్
జగతిన్ విక్రమశాలి పాపయ రణోత్సాహంపు శౌర్యంపు ని
మ్నగలన్ తానముసేయు బొబ్బిలికి నామాన్య ప్రశంసానతుల్.

అలఘులు మాటతప్పని మహాశయు లున్నతులైన వీరబొ
బ్బిలివెలమల్ యశోధనులు వీరులు ధర్మగుణైక శీలు రు
జ్జ్వలమతు లట్టివారి పుటభేదనమందు మదీయసాహితీ
కళను సముద్ధరించు గుణగణ్యులకొంత నమస్సుమాంజలుల్.

శీవికి దానశీలతకు శేవకు పౌరుషరాశికిన్ జగా
తావలమై ప్రపంచచరితమ్మున నిల్చిన వీరభూమి శ్రీ
రావు కులీనులేలిన ధరావలయమ్మున దాల్చె నాకళా
దేవి యశఃకిరీటము సుధీమణులెల్లరు సంతసింపగన్.

నిఖ పేదల్ సుఖజీవనమ్ము సలుపన్ నిర్ణిద్రదీక్షామహా
త్తరమౌ మేల్పథకాల పైచి సతమున్ ధర్మైకమార్గమ్ములో
చరణాల్ వెట్టి కళాసరస్వతిని ప్రోత్సాహించు ధీశాలి సం
బరమౌ సౌఖ్యము లందుగావుతను శర్మారావుః క్ష్మామండలిన్.

ఎల్లల్ దాటిన ప్రేమతో జనహితంబే కోరుకొన్నట్టి మీ
యుల్లంబెంత విశాలమో తెలియలేమో సాహితీబాంధవా!
జిల్లాయేలిక! శర్మరాయ! సుగుణశ్రేష్ఠా! గమాయించె మీ
వల్లన్ నేటిసరస్వతీసదన మహ్వా! నాయదృష్టంబగున్.

ఈ చర్చిలో నెన్నియెన్నొ మారులు జగత్
సృష్టినాయకుని ప్రార్థించినానొ
ఈ రైలు నిలయాన నెన్నెన్నిసారులో
కటికినేలను నిద్రగాంచినానొ

ఆ హ్వా న ము

ఈ కచేరీనేల నెన్నెన్నిసార్లు కూ
ర్చుని కాస్త సేద దీర్చుకొనినానొ
ఈ యుద్ధచిహ్నాంపు పృథులధ్వజస్తంభ
మెన్నిసారులు చూచి యేడ్చినానొ

నవసిపోయినట్టి నాగుండె పొలములో
మొలకలెత్తు కవనకళకు నెన్ని
మార్లు పొంగినానొ మా వీరభూముల
గనినవేళ నిజము తనువుపొంగు.

దయకు మహాసుధాజలధి ధర్మగుణమ్మున భానునందనుం
డయినను లొచ్చె సత్యపథమందున యానము సేయు బుచ్చియ
ప్పయదొరగారు నాచిఋతప్రాయపు కైతల మెచ్చి సాహితీ
జయమునుగోరె వారలు భిషక్కులు దేవులపల్లి వంశజుల్.

ఈ మా దేవులపల్లి వంశజులుగారే యీ నవోత్సాహరే
ఖామార్గాభ్యుదయైక నాగరకతాగంధానకున్ కారణం
బీ మాపల్లెలకెల్ల వారిచలువే యీనాటికిన్ సాంఘిక
క్షేమంబన్నది తథ్యమౌను విజయశ్రీరౌత మవ్వారికిన్

వెంకయదొర తొలిపుత్త్రిడు
వంకలు లేనట్టి ఋజుప్రవర్తనుడు కులా
లంకారుడు కొండలరా
వంకితుడు దరిద్రమానవాళికి సుడువన్.

మండినగుండెలన్ గలుగుమానవజాతిని నుద్ధరింప ను
ద్దండత దీక్షగైనిన ధర్మలు దేవులపల్లివారు శ్రీ
కొండలరావుగారి కిది కొట్టినపిండి సమాజసేవలో
పండిన జాతిరత్నము ప్రపంచముమెచ్చిన కార్యకర్తయౌ.

మీ యూరికి మాయూరికి
తీయనిబంధమ్ముగల దిదే నాపయి మీ
నాయన పెదనాయన చిన
నాయన చూపిన కళాభినందన మొకడే.

పుట్టినసేలలో ప్రతిభపూజకు నర్హము గాదటన్న వా
క్కట్టిదొగాని నాయెడల నిట్టిది వర్ణపిశాచి యుగ్రపున్
నట్టువదొక్క సంఘమున నాజనులందరిలోన బ్రహ్మకున్
గుట్టగకండ్లు సల్పితిరి కొండలరాయ! మనోజ్ఞసత్కృతిన్.

మేలున్ సేయుటె ధర్మమార్గమని యామేలే ప్రపంచమ్ములో
చాలన్ నిల్వగజాలునం చెడద ప్రస్తావింప భావించి శ్రీ
సాలాకొండలరాయ యీసభకు నుత్సాహమ్ము గల్పించి నా
రీలావణ్య కళాసరస్వతికి మీకెల్లప్పు మేలేయగున్.

తథ్యం బెప్పటికైన గూలబడు నీదౌష్ట్యంపు దేశాన నీ
మిథ్యావర్ణపుకంచుకట్టడము "లామెన్" మీమహోదారతా
రథ్యా యానముసేయువారలకు నార్యా! నేటి యాహ్వానసం
ఘాధ్యక్షా! మిము నాశ్రయించెడిని దివ్యంబైన వైభోగ్యముల్.

ప్రేమార నాజన్మభూమిలో నీనాడు
ఫలియించె నాతల్లి స్వప్నబలము
తన మనమ్మున ననుకొనినట్టు లీవేళ
నలరారె గుంటయోహాను కోర్కె
ప్రీతిమై తలచినరీతిలో నీరోజు
తనరారె నాతండ్రి యనినమాట
ప్రేమవాక్కులు నెఱవేఱె నీదివసాన
ప్రతిరూపజనని పోలమ్మయూహ

ఏవిశేషమ్ము లేకపోయిన నిదేమి
చండభండనోద్దండులౌ శౌర్యమూర్తు
లేలు గడ్డలో నాశారదాలలామ
క్రమసత్కారమును పొందగలదె నిలిచి.

ఎదురౌ దెబ్బల తట్టుకొంచిటుల సాహిత్యమ్ము సృష్టింప నే
బదినాల్గేడులు దాటిపోయినవి విద్వాంసుల్ ప్రశంసింప ము
ప్పదికావ్యమ్ముల వ్రాసినాడ కవితాప్రాగల్భ్యమున్ జూపి శా
రద నాలోనివసింప సత్కవనధారల్ పాఱ నాశ్చర్యమే?

నుడులన్నేర్చిన నాకిశాసతిని నన్మున్ ప్రేమదీవించి నా
బిడియంబింతకుమాన్పి నాకవనపుంబిడ్డన్ సమీక్షించి మీ
యెడదన్ నాకొకస్థానమిచ్చిన మనీషీ! తెల్గుభాషోర్వికిన్
గొడుగై నిల్చిన వీరభద్ర! యగుమీకున్ నానమోవాకముల్.

చిఱుతవయస్సులో ప్రతిభ చెన్నె సలారగజూపి పెద్దలం
దరి యభినందనాల్ వడిసినారలు ప్రౌనుచరిత్రదెల్పి మీ
నిరుపమశేముషిన్ తెలుగునేల గగుర్పొడ జాటినార ల
బ్బురమగు వీరభద్రి! బుధముఖ్య! భవన్మహనీయభావముల్.

కృషినొనర్చువాని ధిషణాకషణకు దీ
వనల నొసగి వారి బ్రతుకుగోరు
వీరభద్రరాయ! మీరిడు దీవెన
లమృతశీకమ్ములై సెలంగు.

రచనాప్రక్రియలెన్నియున్నవొ సమర్థంబైన సాహిత్యపున్
రచనల్ జేసితి రన్నిటన్ కొలకులూర్వంశేంద్ర! ఈనాకు నా
రచనల్ సాంతముగా పఠించి నను నాహ్లాదాత్మనింజేసి నా
రుచితస్థాన మొసంగి మీకగుత మెన్నో సాహితీప్రాంజలుల్.

ప్రారంభించినజాలు మీమధురధారాధోరణుల్ దివ్యగం
గారంగద్విచల త్తరంగములు, నేగమ్మత్తొ మీవాక్కులో
చేరెజా మీవలె మాటలాడుటలు మాచేగాదు సాహిత్యలో
కారాధ్యుండవు మీకగున్ శుభములార్యా! పాతుబ్రీధీమన్మణీ!

సేవకు మారుపేరయి విశిష్టబుజుప్రథిత ప్రవర్తనా
భావము కల్గువాడవయి ప్రాజ్ఞులుమెచ్చగ సంఘసేవలో
చేవగడించుకొన్న గుణసింధు! దరిద్రిమనుష్య బంధు! వి
ద్యావినయాత్మకే వి రమణా! శుభసంహతి మీకు నయ్యేడిజా.

## ఆ హ్వా న ము

వెలిగెన్ తెల్గుధరాతలమ్మున యశోబ్ధి వేయిచందాల మీ
పలుకున్ బళ్ళు నవోజ్జ్వ లంబయిన దీపమ్మై పురాణించి మీ
చెలిమిన్ గూటిని స్థానమున్నయది నాచిన్నారి సాహిత్యపున్
పలుకున్ జేడియ కెప్డు జాస్త్రికులదీపా! మత్ప్రశంసావళుల్.

కులసంఘమ్ములపేరుతో ప్రతిభకున్ గోరీల కట్టించు భూ
వలయానన్ ప్రతిభాసమగ్రులకు రవ్వంతైన సత్కారముల్
సలుపన్ గల్గిననాడు సంస్కృతికి నచ్చంబైన యర్థంబు మీ
వలనన్ కొండలరాయ! సంస్కృతికి సంప్రాప్తించె పూజార్హతల్.

తెలుగుల్ మెచ్చగ సత్కవిత్వమున కుద్దీపమ్ము గల్పింప ను
జ్జ్వలసత్కారము సన్మనస్కులయి సల్పన్ నాదుభాగ్యమ్ముగా
తలతున్ నాయభిమానులం దలతు నుత్సాహమ్ముతో గీర్తికా
హాళి మ్రోయించెద వ్రాసికొందు నిక దివ్యన్నవ్య కావ్యమ్ములన్.

కళలన్మెచ్చి యథోచితంబయిన సత్కారాలు గావించి యీ
తెలుగున్నేల ప్రతిష్ఠనిల్పిన జగద్వీరప్రభావాంతరుల్
కులవర్గమ్ముల లెక్కజేయని కళాకూలంకషోద్యన్మతుల్
గల మాబొబ్బిలి సీమవాసులకు నాకైవార నీరాజనాల్,

17-5-1986



# బద్ధార్

ఓయి దేశనాయక వినవోయి నాదు
విన్నపము చెవులారగ విినిన పిదప
పరమసత్యమ్ము వెలయ జవాబునీయు
మటుల గాకున్న మూసికోవయ్య నోరు.

లాలూచీపడి దేశసంపదకు మూలస్తంభమేనంచు నీ
వేలా? సంబరమందుటల్ తెలిసెనోయీ? నీదువక్రంపు కా
ర్యాలెల్లన్ ప్రజలెల్ల గన్గొనుటలేదా? కాలమే నీకు పెన్
గాలంబై యురిత్రాడునై యదియ దుంఖంబందు నిన్ ముంచెడిన్.

ఇదిరా! నీదటరా; యదేనుడువురా యీసొమ్ము నీయబ్బగా
రిదిరా! కాదు ప్రజాధనమ్మగునురా యీనాటికిన్ గూడ న
భ్యుదయార్థంబను పేరుతో జరుపు నీమోస మ్మికెన్నాళ్ళు సా
గదురా నిద్దురనుండి లేచినది లోకంబెల్ల గుర్తింపరా.

కార్మికులు కర్షకులు సమైక్య ప్రతోళి
నడచువేళ నీగుండెలో పిడుగు వడును
దేశభాగ్యమ్మునకు వారిదీక్షగదర!
కారణము నీకు తెలియదా కలుషహృదయ!

19-11-1984

# అవలోడనము

ఘనమహాసౌధమును నానుకొని యొకండు
గుడిసెయుండును చిత్రమ్ము కువలయమున
నొకటి వర్షర్తుకాల మహోగ్రఘురము
వేఱొకండు మహాశరద్వేళఘురము.

మత మేదైనను భాష యేదయిన సంపాదించుకున్నట్టి సం
స్కృతి యేదైనను నిండు నీతనవులో జీర్ణించు జాతీయతా
హితనవోజ్జ్వల భావబంధురత లీహింసాప్రపంచాన క
ద్భుతరీతిం గనిపింపగావలయు భాయీ! శాంతిదీక్షారతా

నిఖిలధరణికి శాంతిని నేర్పినట్టి
భరతభువనమ్ము నీతల్లి ప్రథితయశము
నిలువబెట్టుట నీవంతు నిశ్చయముగ
నీకు గలదు బాధ్యతయు హిందూకుమార.

ప్రతిభకు ధర్మచింతనకు ప్రాణమువోసిన నా తెలుంగుసం
స్కృతికి దెసల్ జొహారులిడి స్నేహపుటత్తము నీయగా సము
న్నతమయి పొంగె నా తెలుగునాడుకు నాజననీమతల్లి సం
స్కృతికివి గర్వకారణము చేసినవారికి చేసినంతగున్.

ఎదిరిన్ చిత్తునొనర్చి లోకమున పెంపెక్కన్ ప్రతిష్ఠాపతా
క దిశాభిత్తితలాన నిల్పి యశమున్ గైకొన్న యాంధ్రుండు నే
డదిరా! నాటి మహోజ్జ్వలోన్నత చరిత్రాంశమ్ముల న్నిల్పుట
న్నది సత్యంబగుచో మహాంధ్రులకు నానందమ్ము చేకూరెడిన్.

22-6-1984



# సంఘములకు

ఒకడు విశ్వాసమ్మునకు తండ్రి యతని వి
శ్వాసమ్ము సంఘాల వరలవలెను
ఒకడు రాజై యుజ్జ్వలకవిత రచియించె
నతనికైతకు గొప్పలందవలెను
ఒకడువక్త ప్రవక్త యూపెను గ్రామము
నతనిభావములెప్పు డందవలయు
ఒకడు సిద్ధాంతి దైవకటాక్షమును బొందె
నతడు సంఘములందు నతకవలయు

అసలు తనదు ప్రాణమ్ముల నఘములందు
మునిగినశియించు మనుజుల బ్రోచుకొఱకు
సిలువ ధరియించి త్యాగమ్ముసలిపె నతని
శాంతిబోధలు లోకాన జాటవలయు.

14-1-1956



# ప్రమోద

కల్లోలమయమైన కాశ్మీరభాగాన
చెలిమిదివ్వెలు ప్రకాశించునాడు
బాధాకరంబైన పంజాబులో శాంతి
మారుతా లనిశమ్ము మసలునాడు
గంగమున్గిన తథాగతుని విగ్రహమును
క్షితి జోతలిడ ప్రతిష్ఠించునాడు
విధ్వంసకుడు మహాబీభత్సకారుని
దుష్టచర్యలు తెగద్రుంచునాడు

మోదమానాడు మాకు ప్రమోద! సర్వ
భారతీయుల సౌఖ్య సంభారగతులు
నీదు రాకడవల్లను నిండవలయు
అందుకో తెల్గుజాత్యభినందమ్ము.

ఋతువుల్ కాలమతిక్రమింపవు నరుల్ లెక్కింప రీకాలపున్
గతులన్ శుక్లగతించె స్వాగతమ్ము పల్కన్నికు వేంచేసి నా
మతి కోలాహలమున్ దయన్ దలచి మాయాహ్వానమ్ము నీనాడు న
న్మతితోగొమ్ము! ప్రమోద! తెల్గులకు నానందమ్ము లీమార్గముల్.

ఏఋతురాజు వచ్చినసరే మఱి: మాకులభించుచున్న యీ
తీరని వేదనాభరపుతీరులు పోయినచందమింత చే
కూరదు తెల్గుజాతికిది గొడ్డలి పెట్టు ప్రమోద: దొడ్డ సం
స్కారముగల్గు తెల్గులకు కాస్త సమైక్య మనుగ్రహింపవే?



# జెండావీరుడు

దండిగ్రామ చరిత్రకారుడగు వార్ధామౌని బాపూజీ హ
స్తందం బూతముగాగ హెచ్చిన మహోత్సాహాన స్వాతంత్ర్యపున్
జెండానిల్పిన వీరయోధుడవు శ్రీశ్రీరామమూర్తీ ! జగ
ద్భాండమ్ముల్ గొనియాడు నీయనుపత్యాగమ్ము శంసార్హముల్.

సిరినమ్మి తనతేని సింహపీఠికపైని
మఱల నిల్పించె భామాషమంత్రి
వేలుపారు వాణిజ్యమును సేయగా దాటె
నంబుధి నవచితిప్పయ్యసెట్టి
స్వేచ్ఛార్థమై దాస్యశృంఖలాల్ తెగద్రుంచె
శాంతితాపసి కరంచందుగాంధి
రాష్ట్రోదయానకు ప్రాణమర్పించె స్వా
ర్థత్యాగి శ్రీపొట్టిరాములన్న

ఆ మహామహితులు చన్న యడుగుజాడ
లీధరావలయానకు పృథులరక్ష
వారలందఱు నీకైనవారు వారి
త్యాగదీపాలు వెలిగె నీయందు నిజము.

కరుడున్ గట్టిన హూణభూధవుల మూర్ఖత్వమ్ము ద్రోహమ్ము మ
త్సరభావమ్ములగాంచి మండిపడి దేశక్షేమ మాశించి చి
చ్చరపిడుగైతివి దేవతాన్వయవతంసా! నీశతాబ్దంపు సం
బరముల్ భారతజాతి జాగృతికి దీవ్యద్దివ్య దీపచ్ఛవుల్.

స్వాతంత్ర్య సమరగర్జాఘోష మాలించి
బాపుజీ పథములో పదమునైచి
దిగులొందు తలి దాస్యనిగళాలు ఛేదింప
నురకలెత్తిన గుండె నుద్యమించి
జాతి శిష్టప్రతిష్ఠాకరంబగు త్రివ
ర్ణ నిభృతమైన జెండాధరించి
ఉన్నదంతయు స్వరాజ్యోద్యమస్థాపన
కై గరికపరగగా త్యజించి

నీతి చెదరనట్టి నీదేశభక్తికి
కార్యతత్పరతకు ధైర్యమునకు
తిరుగులేనివాడ దేవత శ్రీరామ
మూర్తి నీదు త్యాగమునకు ప్రణతి.

ఏవీనాటి పవిత్రభావము లికేవీ నాటి సోదర్యగం
ధావిర్భూతు లికేవి త్యాగమయకార్యంబుల్ సమీక్షింపగా
ఏవీనాడు సమైక్యబంధనము లేవీనాడు ప్రేమైకచి
హ్నావిష్కారము లప్డుగొప్పయది జెండావీర! కైవారముల్.

# భరతధాత్రి

అగ్నికీలావేశ మగ్నతప్త స్వాంతు
మెడకు త్రాడుబిగింపబడిన నాడు
జాతికాంక్షకు నోరుజారిన భక్తుండు
బందికానకు పంపబడిననాడు
పరభూపులేల్బడిన్ ప్రతిఘటించిననాడు
క్రూరహింసకు నేల గూలునాడు
బానిసత్వము మాప ప్రతిన బూనినవాడు
ప్రాణమియ్యగ సిద్ధపడిననాడు

ఒకమహాశక్తి భరతమహోర్వినెల్ల
ఆవరింప నందఱునొకటై కదలుచు
ప్రాణసమమైన స్వేచ్ఛాకవాటములను
తెఱచినారలు భరతధాత్రీ! సవిత్రి.

శహిజెన్నారెడు సుప్రతిష్ఠలకు మార్గంబున్న దేశమ్ములో
శుహానా సంస్కృతి రాజకీయములు సంక్షోభమ్ము చేకూర్చుచో
షహానంబెక్కడ గజ్జెగట్టుకొని యుత్సాహాన నర్తించు ని
మ్మహిలో గిరితిగొన్నదాన! యెటుసంభావించి మేలెంచెదో.

దేశము నుద్ధరించుటకు దీక్షవహించితిమంచు చెప్పి స్వా
ర్థాశయబుద్ధితో నడచునట్టి యుదారుల జన్మభూమిలో
లేశము ప్రజ్వలించునె? లలిన్ నవతా సమతా ప్రదీపికా
రాశులు త్యాగమూర్తుల వరాల సదాచరణ ప్రమేయముల్.



# స్వాతంత్ర్య లక్ష్మి

కోట్ల ద్రవ్యపు కుంభకోణాల విషరూప
వలయమ్ము ఛేదింప బడిననాడు
గాంధీజీకోరిన గ్రామీణరాజ్యమ్ము
నిఖిలభారతములో నెగడునాడు
దళితజాతుల ప్రాణములుదీయు నరహంత
కులకు శిక్షలు వేయగల్గునాడు
కుటిలబుద్ధులు పాలకుల గుండియలదాగు
స్వార్థభూతము కూలి చచ్చునాడు

సరస సమరస సౌగంధ్య సహనశాంతి
మలయశీతల పవనాలు మలగునాడు
అపుడు దేశము మట్టి కాదన్న మాట
నాడు స్వాతంత్ర్యలక్ష్మి కానందహేల.

నా జననీధరాతలిని నాల్గుపదుల్ పయినైదు దాటెన్వే
ట్నా జయగీతికాబ్దముల సందడు లేమిలభించె? బాపుజీ
యోజన మెందగట్టబడెనో? అణగారిన వారిదౌ ముఖాం
భోజము లుల్లసిల్లెనె? ప్రభూత యశమ్ముగలట్టి నేలలో.

ఆ హ్వా న ము

దేశము మట్టిగాదనుచు దిక్తటముల్ ధ్వనియింప తెల్పెనా
వేశితుడై మహాకవి పవిత్రిత జాటగ నాడు వానిసం
దేశము బుగ్గిలోగలిసె నేడిటులేగిన నేమికానొ? యీ
దేశము గంజిలేని కడుదీనుల గుండియ లుద్యమించినన్.

చెప్పుకోవచ్చునా శ్రేయోనిధానమౌ
రాజ్యాంగరచన పరాయికెపుడు
మప్పుకోవచ్చునా మానవత్వములేని
మోసగాండ్రికు పదవుల నొసంగి
త్రిప్పుకోవచ్చునా దేశనాశకులైన
రౌడీలగమి సంగరక్షకులుగ
తప్పుకోవచ్చునా ద్రవ్యార్జనార్థమ్ము
తొడరు ఖద్దరుధారి త్రోవనుండి

ఒకమహోజ్జ్వల చైతన్యమొలసినట్టి
దెసలు ప్రణుతించు స్వాతంత్ర్యదేశమందు
ఏకతాభావ మెంతైన విముడవలయు
కానిచో ప్రజాస్వామ్యమ్ము ఖంగుతినును.

తనువున్ దేశహితార్థమై యెలమి రక్తత్యాగముల్ సల్పితె
చ్చిన సాతంత్ర్యము సాగగావలె నవిచ్ఛిన్నంబుగా నాంగ్లభూ
పుని దౌర్జన్యచరిత్రి మాసినది యిప్డో నల్లవాడేధరిం
చెను దండంబును వానిస్వార్థమున హెచ్చెన్ భ్రిష్టదౌష్ట్రక్రియల్.

ఏదో దుర్గతి పట్టుకొన్నయది నే డీహైందవక్షోణికిన్
సాదుల్ ఖడ్గములన్ ధరించుటలు పూజారుల్ ప్రలోభాన దే
వాదాయాలను మ్రింగుటల్ పరమభక్తాగ్రేసరుల్ నాయకుల్
ఈదేశమ్ము౯ను కొల్లగొట్టుట లికేవీ? దేశసౌభాగ్యముల్.

ఈ గూండాయిజ మడ్డువాడొకడు లేడే? యున్నచో వాడు వా
డే గూండాయగుచోట దేశమునకేదీ? రక్ష యీతీరులో
భాగస్వాములు కాకపోదురె వచింపన్ నాయకోత్తంసు లీ
లాగీదేశముసాగుచో శుభము లెట్లబ్బున్ సమీక్షింపగన్.

ఘంటాపథము సాక్షిగా ఘోరహత్యలు
రోజురోజుకు నడిరోడ్డుమీద
సిరిమగం డానగాహరిజన శిరసులన్
నరరూపరాక్షసుల్ నరకుటయును
అగ్నిసాక్షిగ పెండ్లి యాడిన భార్యను
కట్నాలపేరుతో కాల్చుటయును
ప్రతి చిన్నతరగతి పదవికి యధికారి
మ్రుక్కిడిలంచమ్ము మెక్కుటయును

ఈ మహాఘోరకృత్యాల కెప్పుడెపుడు
స్వస్తి జరుగునో దేశమ్ము బాగుపడుట
యపుడె, యందాక పిసరంత యభ్యుదయము
పల్లవించుట యనుట నభఃకుసుమము.

ఆ హ్వా న ము

కులమునకు కల్మికిని యెంతబలము గలదొ
దేశరాజకీయమ్ముల తెలియజేయు
కులమతాల్ వృషభేంద్రముల్ కుమ్ముకొనుట
ప్రగతిగలదేశ మేరీతి బాగుపడును?

14-7-1992



# ప్రధానికి లేఖ

బహుభాషావిధులై యఖండ భరతస్వాతంత్ర్య సామ్రాజ్య ని
ర్వహణౌజ్జ్వల్య ప్రధానసారథులుగా ప్రజ్ఞాపరిభావాల పరి
త్యహమున్ దేశపుకీర్తి బెంచు నరసింహారాయ! భావోదయా!
మహనీయంబగు మీదుపాలనము సన్మాన్యమ్ము వాచింపగన్.

ఇది మీ జాతకమందు నున్నయది వేరేకాదు ప్రౌన్నత్యమౌ
పదవిన్ దాల్చి మహార్ష భారతధరాభాగమ్ము పాలింతు ర
న్నది మీజాతకసత్ఫలంబిది మహానందమ్ము గల్పించు మీ
యెద దేశాభ్యుదయమ్ము గోరును ప్రధానీ! దివ్యవిద్యాధునీ!

మహనీయుడైన రామానందు నసమాన
ప్రాభవంబైన దీవనలమూట
తెలుగులవెల్గు బూర్గుల రామకృష్ణుని
సౌహార్దమౌ సాహచర్యదీప్తి
పరమసాధువు పుట్టపర్తిలో కొలువున్న
సత్యసాయి దరహాసామృతమ్ము
మూడువేళల లోకముల పహరాగాచు
కోటిదేవతల చూడ్కుల పసందు

## ఆ హ్వా న ము

మీయఖండమైన మేదురభావాల
కూపిరిని నొసంగి యొప్పుచుండు
అభ్యుదయము వరల నానందపథములో
తనరు మనిశమును ప్రధానమంత్రి!

ఆల చాణక్యుడు నా యుగంధరుడు నాయక్కన్న మాదన్న లు
జ్జ్వలదివ్యోహల దోహలుండయిన యప్పాజీ మహామంత్రిధీ
రులు సామ్రాజ్యశతాంగమున్ నడిపిరారూఢాన నాతీరులో
యిల నీయార్ష ధరాశతాంగము ప్రధానీ! సాగు మీయూహకున్.

నికషప్రస్తరమై నిజాయితికి వన్నెంగూర్చు మీ ధీప్రణా
ళిక లీనూతనభారతావనికి నుల్లేఖింప చైతన్య ము
త్సుకతన్ గూర్చుత మీయఖండ ప్రతిభాజ్యోత్స్నల్ ప్రకాశించె నా
యకమాన్యా! దశదిక్కులందు నరసింహారాయ! విద్యోదయా!

తలపన్ కాదనరాని సత్యము దిగంతఖ్యాతిగన్నట్టి యాం
ధ్రుల శౌర్యోజ్జ్వల దివ్యగాథల మహత్తుల్ మీమహాశేముషీ
కలనన్ దక్కెను తెల్గువారలకు పక్కాగౌరవశ్రీలు పా
ములపర్త్యన్వయహేలి: మీవలన సంపూర్ణమ్ముగా గల్గెబో.

కరుణాదృక్కుల సాచి నాకవిత లోకానన్ ప్రవర్ధిల్ల నీ
శ్వరరూపమ్మున నిల్పి కష్టములలో సాయమ్ము గావించె భూ
సురు డొక్కం డిదిలేనిచో నెటులనిల్చున్ గైత, భాషాధురం
ధర! మీవంటి మహోన్నతాశయులచేతల్ జీవధాత్వాంశముల్.

మసుగుంబడ్డ కులానబుట్టి రసవన్మాకంద మాధుర్యసం
భరితంబొప్పగ వ్రాయు సత్కవితకున్ మర్యాదలెట్లబ్బు? మా
కరయన్, సత్యము పల్కుచుంటి నరసింహారాయ! విద్వన్మణీ
స్థిరతన్ బొల్చుత మీదుపాలనము ధాత్రీనిర్జరగ్రామణీ!

విస్ఫురత్ కవిమూర్తి విశ్వనాథుండుప్ర
 జ్ఞా ప్రతిభాశాలి నాగురుండు
నిరుపమాన త్యాగనిపుణుండు, అయ్యదే
 వర నాదుకవిత కాదరణకర్త
కూలినాలియు జేసికొని నన్నుసాకిన
 మాదిగ 'ఎల్లన్న' నాదుతండ్రి
అక్షరాల్ నాకుక్షినమరబోధించు వా
 డైన యోహాను నామేనమామ

తామరను జనియించిన సామిసాని
కనికరాన ప్రేరణమున కారణాన
నాకు నలవడె నీకవనము వచింప
క్షితిజనశ్రేయ! శ్రీనరసింహరాయ!

హృదయము పల్లవింప రచియించితి ముప్పదిమూడు కావ్యముల్
పదముల దేశభక్తి మెయి శౌర్యసముజ్జ్వలమూర్తులైన తె
ల్గుధరణి వెల్గు సాహసుల గొప్పదనంబును గూర్చి ఖండికల్
హృదయము కుందుచుండు నివియెట్టుల నచ్చగు నంచు ధీనిధీ!

అన్నము వెట్టునే బిరుదులన్నియు నున్నవి సాహితీపరుల్
మన్నన నేసి యిచ్చినవి మాన్పునె నాబాధ నేమి నేతు నీ
భిన్నకులాలమధ్యమున పేదబహిష్కృత జాతికిన్ పరి
చ్ఛిన్నము నైన జాతికి నృసింహ మహోదయ! సౌఖ్యమబ్బునే?

నాకున్ డెబ్బదిపైని యొక్కటి వసంతాల్ నేడు జీవింపగా
నాకున్ జేనెడుజాగలేదని ప్రమాణంబున్ పౌనర్తున్ ప్రధా
నీ! కాళ్ళర్గె నికెందుకంచు మఱి మీకేవ్రాయుచున్నాద నాం
ధ్రీకల్యాణికి కంఠహారమగు కవికేదీ! చిన్నవాసంబొకో?

ధీవివేకజలధి! ఈవిశాలాంధ్రమ్ము
కోసరమ్ము నేను గొంతుకలిపి
నాడ తిరిగినాడ వాడవాడల నిప్డు
నన్ను నెఱుగవార లున్నవారు.

నాకున్ గల్గును స్థాన మాంధ్రకవితానవ్యప్రపంచాన భా
షాకల్యాణి శిరఃకిరీటముగ మత్ సత్కావ్య సౌగంధ్య మా
లాకీర్మిర మలంకరించితిని డీలంబడ్డ నాకైతకున్
వీకంగూర్చు రసజ్ఞులేరని? ప్రధానీ! యాత్మ జింతించెదన్.

ఆతడు జాషువ హరిజనులందు నతడు
మొదటికవి బోయిభీమన్న పిదప వాడు
వారితరువాత స్థానమ్ము వచ్చు నాకు
నిత్యదారిద్ర్యదావాగ్ని నెరియువాడ

మిగిలిన ప్రాయమంతయును మేదిని జీవనయాత్రసల్ప నె
ట్లగును? మహోన్నతాశయ! సమాదృతిగల్గిన వారలీరు మీ
రగణిత వాఙ్మయప్రభువు లయ్యది యాంధ్రు లదృష్టమౌను మీ
దగు సముఖానకున్ మనవి తద్దయుజేసితి చిత్తగింపుడీ!

సౌహార్దమ్మగు మీహయాన నుచితస్థానమ్ము గల్పించి నా
సాహిత్యానకు నీడజూపిన సముత్సాహమ్ము దీపింపను
శ్రీహేవాకమనోజ్ఞమంజు కవితల్ సృష్టింతు జాతీయతా
మాహాత్మ్యమ్మును జాటుకొందు భువనంబందున్ ప్రధాన్యగ్రిణీ.

17-9-92



# ముఖ్యమంత్రి దర్శనము

తెలుగు లదృష్టవంతులు ప్రదీప్త చరిత్రగలట్టి మీమహో
జ్జ్వల మహనీయపాలనమువల్ల సుఖింతురు మీమహోన్నతో
హలకు ప్రశాంతజీవితము నందుదు రెప్పుడు ముఖ్యమంత్రి! స
త్ఫలితము లందుచున్ విజయభాస్కరరెడ్డి! మహోదయోదయా!

రెండవసారి యీతెలుగు పృథ్విని నేలగ ముఖ్యమంత్రిపో౹
ద్దండత పీఠమెక్కిన యుదాత్తచరిత్రఘటిల్లె మీకు మీ
పండిన పాలనానుభవ పాటవముల్ నవభారతావనీ
ఖండము జూఱగొన్నయది కల్గుత తెల్గులకట్టి భాగ్యముల్.

మీవిశాల నవ్యభావాలు మహాదాంధ్ర
జాతి నెల్ల నడుపుగాత సతము
కోట్లకొలది మంచిగోరిన మీకు మా
వందనాలు కోట్లవంశహేలి!

కళలన్ పోషణసేసి సత్కవులకాస్కారాలు గల్పించి యు
జ్జ్వలసాహిత్య మరందనిర్ఝరులలో స్నానాలుగావించి రా
తొలిరెడ్డిప్రభువుల్ రసజ్ఞులయి సంతోషాన మీచేతిమేల్
చలువన్ నేటి కళల్ చిగుర్పవలె నాసన్ ముఖ్యమంత్రీశ్వరా!

# పుష్కరాలవేళ

పుణ్యమబ్బు ననుచు పుష్కరాలకు నేగ
అబ్బలేదు పుణ్య మబ్బె చావు
పుష్కరాలలోన ముష్కరుల్ హెచ్చైరి
రమ్యమైన పుష్కరాలవేళ

గౌతమముని మహిమగానొప్పు గౌతమీ
పుణ్యజలములందు మునకలిడుచు
పైనిబడ్డవారి వలువ లేమయినవో
రమ్యమైన పుష్కరాలవేళ.

ఐకమత్యగంధ మంటు నీతీర్థాన
గాహనమ్ము సేయ కాంక్షతోడ
మరియు జనులయెడల మురికిగంధం బంటె
రమ్యమైన పుష్కరాలవేళ.

మంచినీరులేక మంచి బోనములేక
మంచి నిద్రలేక మాడువారు
పుణ్యజలమువలన పొందుదురా? ముక్తి
రమ్యమైన పుష్కరాలవేళ.

దండిసుఖముగోరి పిండప్రదానాలు
చేసినట్టివారి చేతలకును
వెలనుగట్టి మురికిజలముతో బ్రతుకుచే
రమ్యమైన పుష్కరాలవేళ.

కోటిమంది యాత్రికులు పున్నె మాశించి
జలములాడి గేహములకు జేర
నేమిలేక కొందరేగిరి కాటికి
రమ్యమైన పుష్కరాలవేళ.

నింగినేలువాని, నీరజేక్షణునిపై
దృష్టినిలిపి నీటనీదు వారు
భంగపడిరి దొంగభక్తుల చేతిలో
రమ్యమైన పుష్కరాలవేళ.

ఈ నదీజలాల నెన్నెన్నొ రోగాలు
కలుగువార లొడలు పులుముకొనగ
ముక్తి కేమొగాని పొసగించె రోగాలు
రమ్యమైన పుష్కరాలవేళ.

ఇది పరాన్నభుక్కు లే పనిపాటయు
లేనివాళ్ళ కుటిల గానలీల
మాయలకును చింతకాయలు రాలునా?
రమ్యమైన పుష్కరాలవేళ.

# శుభాకాంక్ష

నిండుగ నూరువర్షము లనేకవిధాల సుఖాలతో. జగా
బండెడు మేళ్ళతో, ప్రశుభ బంధుర దివ్య మనోజ్ఞ భావనా
పాండితితో, ఖుషీ కలిగి వర్ధిలు డీరలు మీరలున్ సిరుల్
పండుగవేళ యందున నిలాతలమందున సంకురాతిరిన్॥



# ఆశాగానము

నాది భారతమ్ము మీదట నాంధ్రమ్ము
లేదు మతము గితములేదు నాకు
సత్యపథమె నాకు స్వర్గధామము నాకు
నంతరంగశుద్ధి యాత్మబలము.

విసముజిమ్మి రూక్షవీక్షణాలను క్రుమ్మి
కులమతాల రెచ్చగొట్టువాని
వర్గభేదములకు మార్గమ్ము నగువాని
పలుకరింప నాకు వలనుపడదు.

దిశల నుతులగొన్న దేశమున్ జీల్పంగ
నెత్తు వేయువారి జిత్తుచేసి
దేశభావిభాగ్య మాశించుటే మహా
పరమయోగ్య యాగఫలము నాకు.

చీటిమాటికి జనజీవన యాత్రలో
బందుబస్తు జరుపువా రలన్న
దోచు కొన్నయట్టి దోపిడీగాండ్రన్న
సహజముగనె వెక్కసమ్ము నాకు.

## ఆహ్వానము

మనుజు లందఱొకటె యని వేదికలనెక్కి
అఱచి యఱచి జబ్బ చఱచి చఱచి
కులపు కాంస్యకుడ్యముల దాటనొల్లని
కుటిలురన్న నాకు గుండె మండు.

నుదుటలోన తిట్టి గుదుల ప్రదర్శించు
రెండు నాలుకల శిఖండులన్న
మాటతప్పినట్టి మాయగాండ్రన్నను
చెప్ప నాకు కనుల జేవురింపు.

బుద్ధిమఱచిపోయి ప్రొద్దస్తమానమ్ము
పదవికొఱకు చెక్కభజన సేయు
ప్రతిభలేనివారి గతుల పరీక్షింప
తలచుకొన్న నవ్వు కలుగు నాకు.

మతములన్ని మానవతజాటునని తెల్పి
మతముపేర నొరుల ఖతముసేయు
దొంగసాదులన్న కొంగజపాలన్న
కిట్టరాని యేవగింపు నాకు.

బానిసత్వమందు పడరాని పాట్లెల్ల
పడి కృశించినట్టి భరతమాత
స్వేచ్ఛకోసరమ్ము జీవితా లిడిన త్యా
గుల స్మరించు బుద్ధి కలుగు నాకు.



# డాక్టరు జ్ఞానానందకవి రచనలు

| | | |
|---|---|---|
| 1 | తరంగమాల | 1944 |
| 2 | వసంతగానము | 1947 |
| 3 | గాంధి (అమరగీత) | 1950 |
| 4 | దేశబంధు (అయ్యదేవర కాళేశ్వరరావు) | 1955 |
| 5 | పాంచజన్యము | 1956 |
| 6 | ప్రభంజనము | 1959 |
| 7 | పర్జన్యము (తొలిభాగము) | 1959 |
| 8 | గోల్కొండ | 1963 |
| 9 | క్రీస్తుశతకము | 1963 |
| 10 | క్రీస్తు చరిత్ర (వచనము) | 1963 |
| 11 | విజయాభిషేకము | 1966 |
| 12 | పర్జన్యము (మలిభాగము) | 1969 |
| 13 | అక్షరాభిషేకము | 1971 |
| 14 | ఆమ్రపాలి | 1972 |
| 15 | అక్షరాక్షతలు | 1973 |
| 16 | అక్షరగుచ్ఛము | 1975 |
| 17 | వెలుగుబాట | 1976 |
| 18 | క్రీస్తుప్రబంధము | 1977 |
| 19 | నా జీవితగాథ (తొలిభాగము) | 1977 |
| 20 | అక్షరపూజ | 1979 |
| 21 | హరిజను లంటరానివారా? | 1980 |

22 పిల్లనగ్రోవి 1982

23 రాజధాని 1987

24 కూలీనుండి కళాప్రపూర్ణవరకు 1988

**25 The Vision in the Verses of Dr. Gnananandakavi 1990**

26 వంశధార 1992

27 ఆహ్వానము 1993



## (అచ్చుకావలసినవి)

1 రెండంకితాలు

2 ఆరుదశాబ్దాల కవితాపరిశ్రమ

3 సాహిత్య వ్యాససంపుటి

4 అభినందన పద్య గద్యసంకలనము

5 కనకాభిషేక సన్మానసంచిక

6 గండపెండేర సన్మానసంచిక

7 క్రీస్తుప్రబంధము (రెండవ భాగము)

8 నా జీవితగాథ (రెండవ భాగము)

9 నా జీవితగాథ (మూడవ భాగము)